శ్రీ

# ప్రేమచంద్రయోగి లేక అస్పృశ్యవిజయము


గ్రంథకర్త

ధర్మవరము గోపాలాచార్యులు

వకీలు, బళ్ళారి.


మహాత్ములకు

అంకితము.

మొదటి కూర్పు


బళ్ళారి

నారాయణ పవర్ ముద్రాక్షరశాలయందు ముద్రితమై

గ్రంథకర్తచే ప్రకటితమైనది.

1933.




[ వెల 1—0—0.

# ప్రేమచంద్రయోగి లేక అస్పృశ్యవిజయము

## అవతారిక

హిందూసోదరులకు విన్నపము,

మహాత్మాగాంధీగారాచరించుచుండునట్టి లోకసంగ్రహ కార్యమగు అస్పృశ్య నివారణోద్యమమునందు నాచేతనయినంత సేవను కావింపనెంచి నేనీనాటకమును 1933 సం॥ మార్చి నెలలో వ్రాసితిని. వేదభూమియగు భరతఖండమున నాదియందు జన్మించిన మానవుల సృష్టిప్రకారమును తెలుపునట్టి వేదోపనిషత్తులయందు స్పష్టముగా నివేదింపబడిన చతుర్వర్ణనిర్ణయమునకు విరుద్ధముగ నయిదవది పంచమ వర్ణమనునది కలదని కొందరు హిందూసోదరులు చెప్పుచున్నారు. ఈ యయిదవ వర్ణమువారు పంచములనబడి యస్పృశ్యులు గనున్నారని సహితము వీరు నడుపుచున్నారు. వీరు తమ వాదమున కాధారముగ సనాతన వర్ణాశ్రమధర్మము లున్నవని యుగ్గడించుచున్నారు. కాని పూర్వకాలమునందు, జ్ఞానులగువారు తత్కాల పరిస్థితులననుసరించు యోచించు, యప్పటిజనతాక్షేమమునకై యవశ్యకములని తోచి యేర్పరచిన యాచారములే వర్ణాశ్రయము లనబడుననియు కాలస్థితులు మార్పును జెందినట్లెల్ల నీయాచారములు సహితము నశింపను, మార్పును చెందుచుండుననియు వీరు గ్రహించియుండియు వీరు తమ పట్టునమానక మవక్రీవాదులై యున్నారు- సనాతనులవల్ల పంచములనియు నస్పృశ్యులనియు పిలువబడిన వారికి మహాత్మాగాంధిగారు హరిజనులను పేరిడియున్నారు. వెనుకటివలెనే యిప్పుడును హరిజనులను వెగడి వారిని హిందూసమాజ బహిష్కృతులను చేయవలెననునట్టి సనాతనులయొక్క వ్యవహారము హిందూజన క్షేమాభివృద్ధికి నిరుద్ధమై యపాయకరమై యుండునట్టి స్థితిని గొప్ప సంఖ్యగల హిందూ సోదరులుగ్రహించి యీ యస్పృశ్యతను నశింపజేయుటకు పాటుపడుచున్నారు. ఈ సందర్భమున, సనాతన హటవాదులయొక్క పొరపాటును సవరించునట్టి యుద్బోధనముకావించుచు, హిందూసోదరులకందరికిని, నిజస్థితులను ప్రకటింపనుద్దేశించిన నేనీనాటకమును వ్రాసితిని.

ఇది సాంఘికనాటకమైనను పండితపామరులకు హితముగనుండు పద్ధతులనరసి, హాస్యశృంగార కరుణారసములే ప్రధానముగనుంచి, పాటలు పద్యములు చితస్థలములందు పొందుపఱచి, రచించినాడను.

నాటకములు ప్రదర్శించునప్పుడు, గ్రంథములయందు వ్రాయబడియుండు సంధిపదములను కొందఱు వేషధారులుచ్చరించునప్పుడు ప్రమాదములు సలిపి, ప్రేక్షకులవీనులకు రసాభాసమొనర్చి తాము హాస్యమునకు గుఱియైనది స్వానుభవమై యుండుటచేత నీగ్రంధమున నేను బుద్ధిపూర్వకముగ, జాలచోట్ల సంధులువిప్పి ప్రదర్శకుల యుచ్చారణలకనుకూలముగ వ్రాసినాడను.

ధర్మవరం గోపాలాచార్యుఁడు.

గ్రంథకర్త

# నాటక కథాసంగ్రహము

అస్తగిరి-వేదగిరి-యనునవి రెండు గొప్ప రాజ్యములు. అరవిందపుర మొక గౌరవసంస్థానము. అస్తగిరి రాజున కేక పుత్రుండగు మదనచంద్రుడు, విషయలంపటుండు. అస్తగిరి రాజ గురువు హరిజనవిరోధి, కుత్సితుండు, రాజ్యాధికారలాలసుండు. వేదగిరి రాణి. వీరధన్వి - బ్రహ్మచారిణి. ఈ యమ మంత్రి విశారదుండు. హరిజనమిత్రుండు-జ్ఞాని. మహాత్ముండు. ఇతడే ప్రేమచంద్ర యోగి. శారదాకుమారి యరవిందపురము రాజు యొక్క పుత్రి-రూపవతి. ఈయమ తండ్రి బ్రాహ్మణస్త్రీని వివాహము చేసుకొన్న శూద్ర ప్రభువున జన్మించినవాడు.

అస్తగిరి రాజ గురువు భోగచంద్రుని శీఘ్ర కాలయాత్రకు పోవునట్లు ప్రేరేపించి పంపి మదనచంద్రుని రాజ్య బహిష్కృతుని జేయుటకును-అస్తగిరియందు బ్రాహ్మణాధికార ప్రభుత్వము స్థాపించుటకును కుట్రలు పన్నును. మదనచంద్రుడు వేదగిరిని సులభముగ నాక్రమింప గోరి. యందలి రాజపుత్రి సేనాధికారి వసుపాలుని లంచములతో తనవశము చేసుకొనగ నీవార్తను విశారదుండెఱింగి, వేదగిరిని రక్షించుటకై యస్తగిరిలోనుండు హరిజనులను యుద్ధసిపాయిలుగ చేయుటకుద్దేశించి, భిక్షుకుని వేషముతో, ప్రేమచంద్ర నామంబున నస్తగిరి మాలపల్లెలలో నివసించి, వేదగిరి రాజ భండారద్రవ్యబలంబున హరిజనులనుద్ధరించి, యిరువదివేల హరిజనసైనికులను సిద్ధపఱచి వేదగిరి కాపుదలకు పంపియుంచును. రాజగురువు, శారదా మదనచంద్రుల వివాహము రహస్యముగ చేయించి వెంటనే భార్యాభర్తలిరువురును చండాలురనియు నస్పృశ్యులనియు శాస్త్రనిర్ణయముచేసి, మదనచంద్రుడు రాజ్యాధికార భ్రష్టుడాయెనని గురువాజ్ఞాపత్రికను తండ్రి కుమారులకు పంపును. మదనచంద్రుడు శారదను రాణివాసమునందుంచక దుఃఖము పాలుచేసి, యామె కన్నులయెదుట నామె చెలియగు విప్రసతి భారతిని పరిభవింపనెంచి, భంగమొంది సత్యవతిని నామె రాజ్యముతో పాటు తనవశమును చేసుకొను యత్నము గావించును.- భారతీశారదలను ప్రేమచంద్రుని యొక్క పాపులభించి, వారు వేదగిరి చేరుదురు. యాత్రనుండి భోగచంద్రుడేతెంచి. యస్పృశ్యవిచారణసభ జరుపునట్లు రాజాజ్ఞను ప్రేమచంద్రుడు సాధించును. మదనచంద్రుండు వేదగిరిపై దండెత్తిపోవగ, నతని రాజపుత్రి సైనికులు, హరిజనసైన్యముతో పోరి పరాజితులగుదురు. మదనచంద్రుడు, రాజగురువు బోధనవల్ల నస్తగిరి హరిజనులను దూరముంచినందు చేత తనకుగలిగిన పరాభవమునకు దుఃఖించి సత్యవతితో యుద్ధమాడి పరాజితుడై, మచ్చరించి. వంచనతో సత్యవతిని హరించుటకు యత్నించి, భంగమొంది, ప్రేమచంద్రుని చేతికిజిక్కి, యచ్చటి భారతశారదలనుగాంచి సిగ్గుచే పశ్చాత్తప్తుడగును. అస్పృశ్యవిచారణసభయందు ప్రేమచంద్రునకు జయముకలుగును. గురువుచే నస్పృశ్యులని నిర్ణయింపబడిన శారాదా మదనచంద్రులకు విజయముకలిగి మదనచంద్రుడు రాజ్యాభిషిక్తుడగును. కొన్ని మధ్యరంగములయందు. మద్యపానదుష్ఫలములు-హరిజన విద్యాసక్తులమును-హరిజనులకు. హిందూసమాజమునందు, వాపీజలదేవాలయములవిషయమున గల యర్హతలును నిరూపింపబడియున్నవి.

# నాటక పాత్రలు

పురుషులు.

భోగిచంద్రుడు-(అస్తగిరిరాజు)

మదనచంద్రుడు-భోగిచంద్రుని పుత్రుడు.

విశారదుడు-వేదగిరిమంత్రి.

ప్రేమచంద్రయోగి-(విశారదుడే యితడు)

బ్రహ్మశంకర కేశవస్వామి-అస్తగిరి రాజగురువు

సాంబమూర్తి-అస్తగిరి సిద్ధాంతి

సదాశివుడు-వేదగిరి రాజపురోహితుడు

వసంతసోమయాజి-అస్తగిరి రాజపురోహితునియల్లుడు. యువకుడు యోధుడు.

మునిస్వామి-హరిజనపండితుడు యోధుడు

ముత్తుసామి-హరిజనబాలుడు (విద్యార్థి)

విద్యామణి-అస్తగిరి ప్రథమయానసనపండితుడు

వ్యాసుడు- ,, ద్వితీయ ,,

సుమిత్రుడు-వేదగిరి వేగువాడు

సుదాముడు-అస్తగిరిమంత్రి

వసుపాలుడు-వేదగిరిరాజపుత్ర సేనాధికారి (రాజద్రోహి)

మహమ్మదుసాహెబ్-(అస్తగిరి దేవాలయము కావలికాడు)

భటుడు, చారుడు, హరిజనులభజనగుంపు, బ్రాహ్మణులు పురజనులు.

స్త్రీలు.

శారదాకుమారి-(అరవిందపుర రాజపుత్రి మదనచంద్రునిభార్య)

సత్యవతీదేవి-వేదగిరిరాణి (బ్రహ్మచారిణి)

భారతీమాయి-వసంతునిభార్య (ధీరసాధ్వి)

గంగుబాయి-హరిజనబాలిక (విద్యార్థి)

శ్రీ

# "అస్పృశ్య విజయము"



## —:♦ నాంది ♦:—

శా॥ శ్రీనాథుండును పరాత్పరుండు జనతా। శ్రేయంబు రక్షింపగన్।
జానారంగను రామకృష్ణులను మేల్। జన్మంబులన్ దాల్పగన్।
వైరంబెంచుచు నాథు వెంటధరపై। వైదేహి వైదర్భియా।
శ్రీనారీమణి, యజ్ఞపాణిప్రకృతిన్ సేవింతు మాయాసతిన్॥

## కవిస్తుతి.

సీ॥ శ్రీరామ సౌమ్యంబు శ్రీకృష్ణమధురంబు వడతలో గవితలోఁబడసియుండి।
రామభూషణకవిరాజు బోలినభంగి। సంగీతసాహితి సంతరించి।
సాసవినోదినీ సంఘంబు నెలకొల్పి। పాలుపారు నాటకంబులు రచించి।
సుకవివైష్ణవాంధ్ర నాటక పితామహుఁడన్న। బిరుదొందిబుధులచే వినుతిఁబొంది॥

గీ॥ సత్యసంధత కార్యముల్ -సలుపుచుండి।
పుణ్యపురుషుండు-ఘనుడంచు- గణ్యుఁడగుచు।
దివికిచను దేవభువిపైన-దేజమిడిన।
రామకృష్ణార్యు భజియింతు-ప్రేమతోడ॥

అనుబంధము 1 పాట

# అస్పృశ్య విజయము

## ప్రథమాంకము__రంగము 1.

(అస్తగిరి రహస్యప్రదేశము—ప్రేమచంద్ర, సుమిత్ర.)

సుమిత్ర:— మంత్రిశేఖరా! నమస్కృతులు.

ప్రేమ:— సుమిత్రా! హెచ్చరికతో వచింపుము. ఇచ్చట నేను మంత్రినికాను భిక్షుకుడను సుమా!

సుమిత్ర:— యోగీంద్రా! నాపొరపాటును క్షమింపుడు (అటుఇటు చూచి) ఈపత్రికనుచేకొనుఁడు. (అనిపత్రికనిచ్చును).

ప్రేమ:— (చదువుకొని) సంతోషము శ్రీకృష్ణుని అనుగ్రహమువలన, మన వేదగిరిరాజ్యమునకు, నెట్టియుపాయమును సంభవింప నేరదు పురుషునకన్న నధికంబగు బాహుశౌర్యముకలిగి, వీర ధన్వియగు మనసత్యవతీరాణిని సంగరమున నెదరించి జయించు నట్టి ధీరుఁడుండుటయరుదు. సుమిత్రా! ఈఅస్తగిరియువరాజగు మదనచంద్రుని కుట్రలన్నియు తెలుసుకొంటిని కర్తవ్యములన్నియు కావించియున్నాడను. నేడేయుదయమున మనరాణికి నొక పత్రికనువ్రాసి, మన వేగువానితో బంపినాడను. నీవుమరలిపోయి కడుజాగ్రతతో మెలగుచుండుము. మదనచంద్రుఁడు, మనలను యేమఱించి, పైబడి పోరుటకువంచనలను పన్నియున్నాడు. నీవు రాత్రింబగళ్ళు దేహమంతంతయు కండ్లనుంచుకొని హెచ్చరిక తోనుండుము.

సుమిత్ర:— యోగీంద్రా! మీయాజ్ఞానువర్తి నయ్యేయుండెదను. నాకు సెలవిండు (అనిపోవును.)

ప్రేమ:— ఈఅస్తగిరి భూపాలుడు-భోగిచంద్రుడు, ధార్మికుఁడు ఇతని యేకపుత్రుఁడు మదనచంద్రుడు విషయలంపటుఁడగు దుష్టకర్ముఁడు. భోగిచంద్రుఁడు రాజ్యభారము పుత్రునకప్పగించి, పుణ్యక్షేత్రముల యాత్రకు వెడలియుండినందున యీదుర్మతి మదనచంద్రునకు, వేదగిరిరాజ్యము నాక్రమించునట్టి దురాశ కలిగి, మోసవృత్తికి ప్రారంభించినాఁడు. వేదగిరిసత్యవతీరాణి

రాజ్యపరిపాలనారీతి నీతులనెఱుగని సామాన్య స్త్రీయనుకొని, యీమదనచంద్రుడు మోసవిధముగ, వేదగిరిసైన్యములోని ప్రముఖులకు కొందరికి రహస్యముగద్రవ్యములనిచ్చి యాశలు కల్పించి, రజపుత్రసైనికులను తనపక్షమునకు త్రిప్పుకొనియున్నాడు. ఈరహస్యము నేనెఱింగితిని సత్యవతీదేవి పితరుఁడు సుధీచంద్రరాజు. పుత్రవిహీనుఁడై మరణించు కాలమునందు నన్ను నమ్మి తనపుత్రిని నారక్షణకు నొప్పచెప్పిన కారణంబున, మదనచంద్రుని ప్రయత్నములను వ్యర్థముచేయు నుద్దేశంబున నేనే యస్తగిరికి నీవేషంబున నరుదెంచి చేయవలసినకార్యములనన్నిటిని కావించియున్నాడను. రాజద్రోహులగు వేదగిరి రజపుత్రసైనికులకుమాఱుగ యీయస్తగిరియందు నిరువదివేల మాలసిపాయిలను యుద్ధమునకు యోగ్యులుగసిద్ధపఱచి వేదగిరికి పంపినాఁడను. ఈయస్తగిరిరాష్ట్రమందు గొప్పజనసంఖ్యగలపంచమజాతివారని పిలువఁబడునట్టి మాలలను, యితరజాతులవారు అధములుగచూచి వారిని అస్పృశ్యులని పిలచుచు, దూరమందుంచి, వారిని యేవిధముగను వృద్ధికిరానివ్వకుండ క్రిందికి అణగద్రొక్కియుండుట నేనువినిచూచి సహింపజాలక, నాఅనుతాపప్రేమలను లోలోన నేదాచియుంటిని. దైవము మదనచంద్రునకు దుష్టబుద్ధినికలుగించి, నామదియందున్న వాంఛను తీర్చుకొనుటకు అవకాశముకలుగజేసెను. నేను బిక్షుకుడనై పల్లెలలో నివసింపుచు మాలలకు విద్యాబుద్ధులను నేర్పి త్రాగుడు పోకార్చి, వారితో శుచియైన కర్మలనొనరింపజేసి, బీదలను, ధనికులుగనొనర్చి, వారియువకులయందు డాగియుండిన శౌర్యధైర్యాగ్నులను ప్రజ్వలింపజేసినాడను. మాలలనుద్ధరించుటకై వలసిన ద్రవ్యమును వ్రయపరుచుటకా సత్యవతీదేవి వెనుకదీయక, వేదగిరిరాజభండారమునే నావశమందుంచిన కారణంబున, నాకోర్కెలన్నియు నెఱవేఱెను.

ప్రవేశము—వేగువాడు.

వేగు:— (ప్రేమచంద్రునకొక పత్రికనిచ్చిపోవును).

ప్రేమ:— (చదువుకొని) ఆహా! నేనువిన్నది నిజమే ఆయెను. మా కుమిత్రుడగు, సమరధీరుడునగు అరవిందపురము రాజగు భైరవసింహునియొక్క పుత్రిని మదనచంద్రుడు వివాహము చేసికొనియున్నాడు. ఇది మదనచంద్రుని మరియొకకుట్ర. తాను వేదగిరిపై దండెత్తినప్పుడు. భైరవసింహుడు నారాణికి సహాయమొనర్పకూడదని, వంచనాపూర్వకముగ నీపనియొనరించియున్నాడు. కాని మదనచంద్రా! నీవు లక్ష రజపుత్రసేనతో వేదగిరిమీదికి దండెత్తిపోయినను, నాయిరువది వేల మాలసిపాయిలను యుద్ధమందు జయింపలేవు సుమా? ఓభరత మాతా! నీవుమాకుప్రత్యక్షముగ గోవువంటి తల్లివైయున్నావు కద? పెద్దలను, పిన్నలను, పుణ్యులను, పాపులను, శిష్టులను, భ్రష్టులను, సమదృష్టితో గోవుయెట్లు తనపాలుపిదుకనిచ్చునో అట్లనే నీవు అన్నితెగల తెలుంగుల మానవులకు ఆశ్రయమిచ్చియున్నావే! నీశాంతధర్మగుణంబుల నెంతని నుతింపగలను?

మ॥ సరణిన్ బ్రాహ్మణ వైశ్య శూద్రులు నృపుల్ చండాలురున్-హూణులున్
పరివేష్టింపుచు నాశ్రయింప-సమతన్ పాలించు దైన్యాగ్రణీ,
అరవిందాక్షుని ప్రేమ భామినియునా- ఓభక్త చింతామణీ!
స్థిరభక్తిన్ భజియింతు-భారతసతీ! శ్రీదేశమాతామణీ॥

ప్రవేశము—వసంతసోమయాజి

వసంత:— (నమస్కరించి) యోగీంద్రా! చాలదినములనుండి మిమ్ములనుసేవించి మీతోభాషించునట్టి యభిలాషనాకునుండెను. మీరెవ్వరని నేనడుగవచ్చునా?

ప్రేమ:— వసంతసోమయాజీ! నేను నీవలెనేమనుజుడను.

వసంత:— యోగీంద్రా! నాపేరుమీకెట్లుతెలిసెను.

ప్రేమ:— సోదరా! నిన్నునేను తెలుసుకొనుటకును, నన్నునీవు తెలుసుకొనుటకును సాధనశ్రద్ధయున్నయెడల, మనము పరమాత్మనే తెలిసికొనజాలమా?

వసంత:— మహాత్మా! ఇట్టియోగులగు మీరు మాలపల్లెలో నేల నివసించుచున్నారు?

ప్రేమ:— సోదరా? మాలపల్లె మనభరతమాత యొక్క భూమి కాదా?

వసంత:— అక్కడ నివసించువారు చండాలులే?

ప్రేమ:— సోదరా! చండాలులు మనవలెనే మనుజులుకారా?

వసంత:— వారుమనుష్యులైనను, వారి సహవాసము మనకు యుక్తముకాదె?

ప్రేమ:— ఎందుకు కాదు?

వసంత:— వారు విద్యావిహీనులు, అశుచులు, నీచమాంసాహారులు మద్యపానమొనర్చి దేహముపై ప్రజ్ఞలేక యెన్నియోదుష్కర్మలుచేసెడిపాపులు. ఇట్టివారు ఇతరులకుసహవాస యోగ్యులగుదురా?

ప్రేమ:— వారు యీస్థితిలోనున్నారని చూచి అనుతాపములేక మనమూరక వారినిదూషించుచు, యెగతాళిసెయుచు, నుండునది మానవధర్మమగునా?

వసంత:— మనమేమిచేయగలము?

ప్రేమ:— వారికితగుమైన బోధలనొనర్చి, వారియొక్క అసహ్యకర్మలను మనముమాన్పవలెను.

వసంత:— యోగీంద్రా! చండాలులుమనకు అస్పృశ్యులగుటచే, వారిని మనము చేరుటయెట్లు? వారికియుపదేశములు చేయుటయెటు?

ప్రేమ:— సోదరా! చండాలులను మనముసమదృష్టితో చూడవలయును వారిని పరిశుద్ధులుగ జేయవలయును.

వసంత:— యోగీంద్రా! మీరనుడువునది పూర్వకాలపు మాటగనున్నది. అదియీకలియుగమునజరుగదు. అప్పటి ప్రేమజ్ఞానులకును, యిప్పటినావజ్ఞానులకును మిగుల భేదమున్నది ఈయుగమున మానవులయొక్క జ్ఞానమంతయు, తమశరీరపోషణా సంతోషమునకును, తమభార్యాపుత్రుల దేహానందమునకును, ద్రవ్యార్జనకును, దుర్బలులను అన్యాయముగ నడగద్రొక్కు

నట్టి అధికారప్రాప్తికిని సాధనాభిలాషయైయున్నది. ఈనామజ్ఞానులు ఐహికసుఖమునకు మరగి, ఆముష్మిక సుఖముండునదే యెరుగకయున్నారు. వీరియొక్క హృదయము నిండుగనుండునవి అజ్ఞానభావములు. దేహమునిండుగ కానిపించుచుండునవి పట్టెనామములు. మానసమునంతవిషము. మాటలయందు అమృతము ఇతరులకు తామునోటచెప్పునది హితము తాముచేత చేయునదిపాతకము. యోగీంద్ర! ఇట్టివంచనాజ్ఞానులే. యిప్పుడు లోకవిగ్రహకార్యములకు కంకణబద్ధులైయున్న వారు.

ప్రేమ:— సోదరా! నీవువచించినది యథార్థమే. అయిననునిక్కంపు జ్ఞానులును, సమదర్శకులునుడున్నారు. అట్టివారుండుటబట్టియే, ధర్మదేవత, యొకపాదముతోడనైనను నిలచియున్నది. పూర్వకాలమున, బౌద్ధమతాచార్యునిబోధవలన మానవులకు మేలుకలుగలేదు. పిదపశంకరాచార్యులుద్బోధించినట్టి నివృత్తిమార్గము నవలంబించిన మనవారు ఆత్మజ్ఞానమును పొందజాలరైరి. తదుపరి, రామానుజాచార్యులుపదేశించిన ప్రవృత్తిమార్గమున ఆత్మజ్ఞానసాధనమే నిధనమై. దేహసుఖసాధనమధికమాయెను. ఇందుచేత జ్ఞానసిద్ధులైనవారు ప్రవృత్తిమార్గమును తలచుటకే భీతిజెంది, నిష్కర్మయోగమును గట్టిమనస్సుతో నిలువబెట్టి, ముక్కులుపట్టుకొని, మూలలకుగూర్చునియున్నారు, కాని, బైలునకు రాకయున్నారు. ఇంకకుత్సితజ్ఞానులన్ననో, తాముచూడజాలనట్టియు, యితరులకు తాముచూపలేనట్టియు సర్వాత్ముండగు దేవుండు, తమపిత్రార్జితపుగంటుమూట అనుకొని ఆదేవునియొకమందిరములోపెట్టి, తలుపులుమూసి, తాళములువేసి బంధించి అస్పృశ్యులని తాముపేరుపెట్టినవారు ఆదేవునిచూడరాదనియు, పూజింపరాదనియు విధించుచున్నారు. సోదరా! ఇట్టిదేయిప్పుడు వేదప్రోక్తమగుజ్ఞానముగనున్నది.

వసంత:—మహాత్మా! ఇది వేదప్రోక్తజ్ఞానముకాదు. వృద్ధస్వార్థప్రోక్త అజ్ఞానాచారము. ఇదివేదములకంటెను పురాతనమైనదట. ఈవృద్ధాచారమును నిందించువారులు, దురాచారులట. యోగీంద్రా!

ఈవృద్ధాచారనదీప్రవాహమే, అస్తగిరిసంస్థానమునందు పారి, పొంగి, బీదలయిండ్లను కూల్చిపాడుచేయుచున్నది.

ప్రేమ:— నిక్కమాడితివి. ఈఅనర్థనదీప్రవాహము, క్షీరసముద్రమునుచేరి, తాకి, అల్లకల్లోలము కావించుటకుముందె, యిది పోవుచుండుత్రోవను నిరోధించి, బడబాగ్నిగుండములోనికి దీని త్రిప్పి, పడద్రోసి కాల్చినీఱుచేయుటకు నేనుసిద్ధుఁడనై యున్నాఁడను. ఈవంచనాజ్ఞానులు, యీఅనర్థాచారపోషకులు, భవిష్యద్విచారములేక, కన్నులుమూసికొని తాముచెడుటయే కాక, దేశాభివృద్ధివినాశమగునట్టి కార్యములనొనరించుచున్నారు. నిజస్థితియందుతమకు సమానులైనమానవులను "అస్పృశ్యులని" పిలచి వారినిబీదలుగను, పరతంత్రులుగనుచేసి, యింతకాలమువఱకు వారినినేలకుత్రొక్కి పైనికిలేవకుండ అణచిపెట్టిన ఘోరపాపముచాలక, వారువిధించినట్టి అస్పృశ్యమును భూలోకమున శాశ్వతముగ నిలుపనుయత్నించుచున్నారు. వీరుచేయునట్టి పాపమునకు యెంతకాలమని పరమాత్మయోర్చియుండును? శీఘ్రకాలంబుననే, సమత్వసమదృష్టులను స్థాపించి, పతితులను ఉద్ధరించుటకై భగవంతుడు సత్యసంకల్పము నొనరించియున్నాడు. మనయందిప్పుడు పొందుపడియుండు సజాతివిరోధంబులను గాంచి, మనభూమాత చెందుచుండు దుఃఖముత్వరలోననే తీరగలదు.

మ|| వెలసెన్ నీసిరినాఁడు పుణ్యఋషులున్ - వీరుల్ ధరాధీశులున్।
పొలతుల్ సాధ్వులు సత్యసంధులునినున్ - బూజించి సేవింపగన్।
నెలబాసెన్ తలి! నీసుఖంబయదు గా - నేడీవిరోధంబుచే।
చెలఁగున్ నీవిభవంబునీకుమరలన్ - శ్రీదేశమాతామణీ॥

వసంత:— (మ్రొక్కి) యోగిచంద్రా! చండాలులనువారిని, మావారుహింసించుచుండునది నేనుచూచి, యోర్వలేక యేమియు చేయజాలకయిదివఱకూరకుంటిని. మీదయా, శాంతిక్షమాగుణంబులును, స్వార్థత్యాగ, పరోపకారయోగంబులును, నన్ను మీయెడకు నాకర్షించుచున్నవి. అనుగ్రహించి, మీరునన్ను

శిష్యునిగస్వీకరింపవలెనని ప్రార్థించువాడను. నేటినుండి నా దేహప్రాణంబులను మీకుసమర్పించినాఁడను. కరుణింపుఁడు.

ప్రేమ:— సోదరా! నీదృఢభావమునకు నేసంతసించితిని నేనుచేయుచుండునట్టి లోకసంగ్రహకార్యమునకు నీవునాకు సహకారియగుటకు నేనంగీకరించినాఁడను, నీకుచెప్పవలసిన విషయములు మిగులకలవు. అవకాశముకలుగించుకొని, నాయెడకుఁ రమ్ము.

వసంత;— భాగ్యము. (అనిమ్రొక్కి వెడలును)

## ప్రథమాంకము—రంగము 2.

వీధిలో ప్రవేశము—సాంబమూర్తి సిద్ధాంతి

### పాట—అనుబంధము 2.

సాంబ:— "ద్రవ్యం"—"ద్రవ్యం" ఈద్వ్యక్షరమంత్రమును నేను జపముచేయుచున్నాను. నాగరపువారు "శ్రీబ్రహ్మశంకర కేశవస్వాములవారు, "త్ర్యక్షర" మంత్రమును జపించుచున్నారు "చండాల" "అస్పృశ్య" అనునట్టి మూడక్షరముల జంటమంత్రమును కడుశ్రద్ధతో జపించుచున్నారు "అధికార" ఫలమును అభిలషించియున్నారు. వారికి యిప్పడుండునట్టి మతాధికారము చాలదా? రాజ్యాధికారము సహితము ఆశించియున్నారు గొప్ప సంసారమును గొంతుకుకట్టుకొనువఱకు సన్యాసినామము సార్థముకాదు కాబోలు భోగిచంద్రరాజు యాత్రకుపోయియుండునట్టి తరుణమున స్వాములవారే మదనచంద్రునకు కన్యనిశ్చయించి, వివాహముచేయించి, పెండ్లికూతురును అస్తగిరికి రప్పించి, యేమేమొకుత్సితయోచనలు చేయుచున్నారు. మదనచంద్రునిరాజ్యభ్రష్టునిగావించి, ఆవృద్ధరాజును పేరునకుమాత్రము. రాజు అనిపించి, స్వాములవారే అస్తగిరికి భూపాలురై యుండునట్టి యధికారము నార్జించునట్టి యత్నములోనున్నారు. అదియేమైననుకాని, దానిచింతనాకెందుకు? ద్రవ్యము మూటగట్టుచింతయె నాకుచాలును. నేనుద్రవ్యచింతన చేయుచుండగా, నాభార్య సత్యచింతనచేయుచున్నదే? నేను సత్యముగాసంపాదించవలెనట. సత్యముగా ఆర్జించకున్న ఆమెయొళ్ళునిండ సొత్తులుయెట్లువచ్చుచుండెను? సత్యమేదియో, అసత్యమేదియో ఆ మూఢురాలికి తెలుసునా? కన్నులకు కానిపించుచుండునదియే 'సత్యము, కన్నులకుకానరానిదే "అసత్యము". ద్రవ్యము, సత్యము, దైవము, అసత్యము కనులేకున్న దైవపూజయెట్లు జరుగును? పూజారి టెంకాయతాకునా, గంటవాయించునా? కావున ద్రవ్యభక్తియే ఉత్తమభక్తి దానితోడనేముక్తి.

పాట-(పై పాటయొక్క 2, వ చరణము)

స్వాములవారు, నోటితో చండాలులు, అస్పృశ్యులని చెప్పుచు, చేతితో నాకుద్రవ్యమునిప్పించి చండాలులయిండ్లకుపోయి ఉపన్యాసములుచేయమని నన్నుపంపుచున్నారే? ఈసత్యమువలన, అస్పృశ్యులను తాకుటచేకలిగినట్టి మైలయంతయు, వరహాల స్పర్శచే పరిహారమైపోవుచున్నది? అస్పృశ్యము నన్నుఅంటుకొనియున్నదా? లేక దేవుడు నన్నుశిక్షించినాడా? ఇంకనునాకు ద్రవ్యము నెక్కువగనేయిచ్చి నన్నుఆనందముగ నుంచియున్నాడు. అస్పృశ్యదయ్యముపట్టినట్టి పండితులే, కడుపులెండి. వెలికిలబడి, పండ్లిగిలించుచున్నారు. ఇదివఱకు తొమ్మిదిఉపన్యాసములుచేసినందుకు తొంబదివరహాలు నాచేతిలో ఝుణఝుణరాలినవి. అదియేమి ఆభిక్షుకుని ప్రభావమో, మాలపురుగు ఒక్కటైనను నాఉపన్యాసమును వినియుండేయొట్టున్నది (ఆలకించి) అదిగో మాలలుభజనచేయుచు వచ్చుచున్నట్లున్నది నేనుమాత్రముగనిలచియుండెదను (అనిప్రక్కకునిలుచును)

ప్రవేశము మాలలు (పాడుచు)

పాట—అనుబంధము 3.

మాలలు:— (పాడుచు వెడలిపోవుదురు)

సాంబ:— ఈమాలలకు ఆభిక్షుకుడు రామభజన నేర్పినాడే? వీరికి దైవభక్తిపట్టుపడెనేని, త్రాగుడు బొత్తిగవిడిచెదరు. నావరహాలమీద రాళ్ళుపడును కావునవీరియొక్క రామభజనవిడిపించి వీరికి నేను కామభజనను నేర్పెదను (పాడును).

పాట—అనుబంధము 4.

(సాంబమూర్తి-పాడినక్షణమే ప్రవేశము మాలలు పాడుచు)

పాట

సాంబ:— కాముండె దేవుండు కాముండెపూజ్యుండు|
కామునిభజనమె కామితము॥

మాలలు:- రాముఁడె దేవుడు రాముఁడెపూజ్యుఁడు।
రామునిభజనమె కామిత ౧॥

సాంబ:— సోదరులారా! మీపాటనిలిపి, కొంచెముశాంతి తెచ్చుకొని నామాటవినుఁడు.

మాల:— అయ్యా! నీమాటలేమియు మాకువలదు. నీవుమాకేమియు చెప్పనవశ్యకమేలేదు.

సాంబ:—సోదరులారా! నేనిదివరలో చెప్పినట్లు ఉపన్యాసము చేయను భయపడకుడు మీరిప్పుడుచేసిన దైవభజనసరియైనది కాదు కనుక, మీకు శీఘ్రముగా మోక్షప్రాప్తియగుటకు, పవిత్రమైన భజనపాటను నేర్పించెదను నేర్చుకొనుఁడు.

మాలలు:— అయ్యా! అదియెట్టిపాటయో చెప్పుము వినియోచించెదము.

పాట

సాంబ:— (పల్లవి). కామకామ-భామాజనప్రేమా।
కాంచనభోగసుధామా॥

దీనిని చెప్పుడు.

మాలలు:— రామరామ శ్రీజానకిప్రేమా।
రంజిత స్వర్గసుధామా॥

సాంబ:— ఛీ, ఛీ, బుద్ధిహీనులారా! మీరు 'రామ' అనినట్లయిన చెడిపొయ్యెదరు వినండి 'మ' అంటె మాలవాండ్లను 'రా' అంటె రాచుము అనియర్థము 'కా' మ, అంటే మాలవాండ్లను కాచుము అనియుర్థము తెలిసెనా? రామ అంటెమీరు, నాశమైపోయెదరు కనుక, నేనుచెప్పినట్లుఅనుడు.

(అనిపాడును)

"కామకామభామాజనప్రేమ" అనుడు.

మాల:— అయ్యా! మీరుపెద్దలు, బ్రాహ్మణులు మీరుఅనినట్లు మేముఅనలేమయ్య మాచేతగాదు.

సాంబ;—ఎందుకుచేతగాదు? నేనుమీతో పలికించెదను. ఏదిఅనుడు

'కామ కామ'

మాల:— రామ రామ.

సాంబ:— (మరలయత్నించి వ్యర్థుడై) ఛీ మొద్దుకుంకలారా! ఇదే మీచండాలబుద్ధి అందుకే బ్రాహ్మణులు తలతలకొట్టుకొని, మిమ్ములను ముట్టనైనముట్టరు మీబుద్ధిధ్వంసమైపోవుటకు నేను చక్కనిమందువంటి పాటను నేర్పించెదను నేర్చుకొనుడు.

మాల:— అదియేమి పాటయ్యా?

సాంబ:— సోదరులారా! నేనుమీకు శతృవుడనుకాను-మీయొక్క క్షేమముకోరువాడను. మీరుబాగవిని నావంటిబుద్ధితెచ్చుకొని, నేనుచెప్పినట్లుచెప్పుడు.

(అనిపాడును)

పాట,

మద్యపానము మిగులపుణ్యము మనకునిచ్చుభోగము॥ .అనండి

పాట,

మాల:— మద్యపానము మిగుల పాపము మనకుతెచ్చురోగము॥

సాంబ:— అట్లుకాదురా.

(అని మరలపాడును)

పాట- సురత్రాగినవరులెల్లరు-సురలోకముచేరగలరు॥

మాల:— పాట- సురత్రాగినవరులెల్లరు నరకంబునపడిపోదురు॥

(అని పాడుచుపోవుచుండగా)

సాంబ:— ఏమరా! అట్లుపోవుచున్నారు నిలువుడు.

(అని సమీపించును)

1. మాల;— అయ్యా! నీవుమాదగ్గరకు రాకుము నీమైల మాకుతగులును. నీచండాలబుద్ధి మాకువలదు దూరముపొమ్ము.

2. మాల.— సోదరా! యీఅయ్యవారిని లక్ష్యములేక గద్దించుచున్నావే ఇతడుయెవ్వడనుకొంటివి?

1. మాల:— ఈయన, మనకు అస్పృశ్యుడు అనుకొనినాను.

2. మాల:— అట్లయిన, మనమేదూరము పోవుదముర మ్ము.

(అనిపోవుదురు)

సాంబ:— గ్రహచారమా! అయ్యో వారిని చేయబోయిన కోతి పిల్లఆయెనే. చండాలులే బ్రాహ్మణులను అస్పృశ్యులనునట్టి కాలము వచ్చెనే.

ప్రవేశము మునిస్వామి

ముని:— సిద్ధాంతులవారు! దండములు.

సాంబ:— దీర్ఘాయురస్తు! నాయనా, నీపేరేమి?

ముని— నాపేరు మీవారేపెట్టియున్నారే. "అస్పృశ్యుడు"

సాంబ:— కోపమువలదు నాయనా! మావారిమాటనాకెందుకు? ఆమాటనేను అనలేదే? ఇదిగో! నేనుదగ్గఱకే వచ్చుచున్నాను. (అని మునిస్వామియొక్క చెయ్యిపట్టుకొని) ఇప్పుడైనను, నీ అనుమానము వదలెనా?

ముని:— అయ్యా! యిట్లనేనీవు నాచెయ్యిపట్టుకొని శ్రీకృష్ణదేవాలయములోనికి నన్నుతోడ్కొని పోయెదవా?

సాంబ:— "నేనుచేయను" అనిచెప్పునట్టిపనియే లేదునాయనా! యీపని నేనుఅవశ్యముచేసెదను.

ముని:— అట్లయిన నడువుము దేవాలయమునకు

సాంబ:— నాకు యెంతదక్షిణయిచ్చెదవో చెప్పుము?

ముని:— మీకేమియునియ్యను కాని, గుడిలోనుండు అర్చకునకు దక్షిణయిచ్చెదను.

సాంబ:— ఈ విషయము మఱియొకవేళ యోచించెదను, కాని నీవు మొన్న నన్నుచూచి దూరముగాపోవుచుండినవాడవు యిప్పుడు నీయంతటనీవె నాదగ్గఱకువచ్చితివే యేమికారణము?

ముని:— అయ్యా! మద్యపానము నిషిద్ధముకాదు. అందులో కమ్మతకాండ్లగు చండాలులు ముఖ్యముగా త్రాగవలెనని మీరు ఉపన్యాసముల నిచ్చుచున్నారే, మీరుమద్యపానముచేసెదరా?

సాంబ:— మాపూర్వీకులు సాధువనిస్వీకరించిన మద్యమును నేను పుచ్చుకొనినదోషములేదు, కాని, ఇదిద్రవ్యము వ్రయమయ్యెడు పనికావున నేను దానినిచేయజాలను అంతే.

ముని:— అయ్యా! మీపూర్వీకులు స్వీకరించినది మద్యముకాదు, సోమము అనినేను తెలుసుకొనియున్నాను.

సాంబ:— (నవ్వి) అన్నమునకు అశనమునకు యెంతభేదమున్నదో, మద్యమునకును, సోమమునకును అంతేభేదమున్నది. దేవతలు తాగునందుకుసుర, సుగంధముండుచేటత గంధోత్తమము. గిర గిరత్రిప్పి ప్రదక్షిణముచేయించును గనుక "ఇరా" సోమరాజు లు తాగునందుకు "సోమము" యిట్లనేయెన్నియో పేర్లు మద్య మునకుగలవు. ఈవిషయము యింకనుచాలయున్నది.

ప్రవేశము-ప్రేమచంద్ర.

ప్రేమ:— సిద్ధాంతిగారు! భగవంతుని కృపచేత పరిశుద్ధాత్ములైన వారికి దుర్బోధనలుచేసి వారిబుద్ధులను చెఱుపుటదే కాబోలు మీయొక్క పుణ్యవృత్తి?

సాంబ:— యోగీంద్రా! నమస్కారము. నేనేమి దుర్బోధనలను చేసితిని?

ప్రేమ:— సోమపానమును, మద్యపానమును యొక్కటేయగునా?

సాంబ:— నాకు తెలిసినదిఅంతె. మీకు తెలిసినదిచెప్పుడు నేను దాని నే యంగీకరించెదను. ఏఫణిలో మణియున్నదో నాకు తెలుసునా?

ప్రేమ:— సిద్ధాంతీ! సోమము యెంతమాత్రమును, మద్యముకాదు. అది సోమవల్లరీరసము. దానినియజ్ఞములందు వినియోగ పఱ చునట్టి విషయము కడుపవిత్రమైనది. పూర్వమందు పండితో త్తములు, యజ్ఞములందు, మితి, నియమములను విధించి, సోమ మను తీగయొక్క రసమునుపయోగించిరి. ఆమహనీయులకు కలి గియుండినట్టిజ్ఞాననిగ్రహబలంబులు మనకుగలవా?

సీ॥ ఆహ్యబుశ్రద్ధతో, సద్వ్రతంబును సేయ-నెఱసినజ్ఞానంబు మనకుగలదె?।
పూజ్యులుతమదేహ పుష్టినార్జించిన-ఘనతరశీలంబు మనకుగలదె।
యోగులువిజ్ఞాన భోగమొందినమార్గ-మును గాంచుపదిలంబు మనకుగలదె।
తపసులన్నముమాని విపినంబులందుండి-తనరినతనుశక్తి మనకుగలదె॥

గీ॥ వాతబెట్టినంతనె నక్క-వ్యాఘ్రమగునె।
నూతనమునుగంగదుష్కి-యల్ పూతమగునె।
వెకలిజందెమునుధరింప-విప్రుడగునె।
సత్యనిష్ఠయెల్లరికిని-సాధ్యమగునె॥

అప్పటిజ్ఞానసంపన్నులు అగ్నిస్తంభన, జలస్తంభన, యేకభుక్తము దీర్ఘోపవాసతపస్సులను సలుపుచుండిరి, వీటినినీూరుచేయగలరా? ఇట్టిబలహీనులు, ఆపెద్దలసామ్యమును యేమిటచేసుకొనగలరు? విద్యాధైర్యఔదార్యదాంతి క్షాంతితపోనిష్ఠలుకలిగినట్టి శుక్రాచార్యుడే దివ్యమైనమృతసంజీవనీవిద్యనుపోకార్చుకొనినందుకు, మద్యపానమేకదా కారణము? బలరాముడు, తనతమ్ముడు శ్రీకృష్ణుడు, అవతారపురుషుడనునట్టి జ్ఞానమును, కోలుపోయినందునకు యీమద్యపానమేకదా కారణము? విచారప్రబుద్ధులైన అనుభవజ్ఞులు మద్యపానమునిషిద్ధమని విధించియున్నారు. ఈ మద్యపానము మనకెంతచెఱుపు చేసియున్నదో విచారింపుడు. మనవారుకోట్లకొలది, నిరుపేదలై, యొక్కపూటమాత్రమే భుజించి, దినదినమును శుష్కించి, గుట్టలక్రింద, చెట్లక్రింద, గుడిసెలలోపడి, యేడ్చిప్రాణములను విడుచుచున్నారే? మన వారికి బుద్ధులుచెదరి, గుండెలదిరి, వెఱ్ఱికుదిరి, అవివేకము ముదిరి, కులవిరోధములు, ఈర్ష్యలు, కలహములు మిక్కుటములై కక్షలుపండి, కుక్షులుయెండియుండుటకు కారణము యీమద్యపానమేకదా?

సీ॥ కల్లుసారాయీలు కడుపునవిషమౌచు-కండలన్ పేగులన్ కాల్చివైచు।
మద్యంబుత్రాగిన మనుజుడుమెత్తెక్కి-భూమిపైపడిలేచి పొరలుచుండు।
దుర్గంధమునుజూచి దూరముందురుజనుల్-యొక్కరైననుతన యొద్దరారు।
త్రాగుభోతునకెందు దక్కదుమర్యాద-కాలుదెబ్బలుతిట్లు కాంచుచుండు॥

గీ॥ ఇంటదుఃఖానతనభార్య-యేడ్చుచుండు।
కూడబెట్టినధనమంత-క్రుంగుచుండు।
పొట్టబట్టలకేచింత-పుట్టుచుండు।
కల్లుదేహధర్మములను-కాల్చుచుండు॥

కావునసిద్ధాంతీ! నీవుద్రవ్యాశచేత మానవులయొక్క దేహములకును, జ్ఞానమునకును వినాశహేతువగునట్టి యీయుపదేశముచేయునది మేలుకాదు.

సాంబ:— యోగిచంద్రా! ద్రవ్యమునుసంపాదింపకున్న జీవనమెట్లుజరుగును.

ప్రేమ:— ఇట్టిదుష్టమైనయుపన్యాసములు మాని, సత్యమైన యుపన్యాసములుచేయుము.

సాంబ:— యోగీంద్రా! జనులకు, సత్యముచేదుగను అసత్యము తీపుగనుండునప్పుడు. సత్యోపన్యాసములకు కాంచానములు రాలునా?

ముని:— అయ్యా! మీకుద్రవ్యమొసగినయెడల మీరుసత్యమగు ఉపన్యాసములను చేసెదరా?

సాంబ:— ద్రవ్యమిచ్చువారుండిన, నేనుచేయజాలని, పనియేలేదు దేవుడురాయిఅనియు మన్ను, జలమనియు వాదించి సాధింప జాలనా?

ముని:— మద్యపానము నిషిద్ధమని ఉపన్యసించుటకు మీకెంత ద్రవ్యము కావలయును?

సాంబ:— పదివరహాలు చాలును,

ముని:— ఇదిగోచేకొనుడు (అనిపైకమునిచ్చును) ఇంకనైన లోకులకు సన్మార్గబోధలను కావింపుడు.

సాంబ:— (పుచ్చుకొనిముందునకునడచి) (స్వ) ఆహా! ఏమికాల విపరీతము? ఒకసంవత్సరము క్రిందట నేను చూచుచుండ వీధుల నూడ్చుచుండిన, యీమాలవాడు మునిసామి త్రాగుడువిడచి శుభ్రమైన వస్త్రములను ధరించుకొని బ్రాహ్మణుడుచేయవలసిన లోకసంగ్రహకార్యమునకు తానుపూనుకొని నాకేఉపదేశకర్తఅయినాడే? భగవంతుడు తనలీలను తలక్రిందుచేసినట్లున్నది. ఇకముందు చండాలుడు బ్రాహ్మణకర్మ బ్రాహ్మణుడు చండాలకర్మచేయునట్లు తోచుచున్నది. ఇకముందెందుకు అప్పుడేజరుగుచునేయున్నది. కాలచక్రముతిరుగుచున్నది. తిరుగని నేనుదానిని నిలుపగలనా? అదిఆగునా?

(పోవును)

ప్రేమ:— సోదరా! మునిస్వామి! మీవారుచాలహెచ్చరికతోనుండవలయును. అస్తగిరిరాజ గురువులవారు చండాలుల యెడకడు చలము పట్టియున్నారు. మీకు "అస్పృశ్య" లనిపెట్టినపేరును శాశ్వతముచేయవలెనని బద్ధకంకణుండైయున్నాడు. నాబోధన

ములను మీరువిని, శుచులై, విద్యాబుద్ధులయందును, ద్రవ్యస్థితులయందును, వృద్ధిచెందియుండినది. ఆగురువులయొక్కయు వారి శిష్యులయొక్కయు కన్నులకు కీసరుగనున్నది. మిమ్మును, మీ మొదటిస్థితికి తేవలయునని, ద్రవ్యలాలసులతో నిట్టి యుపన్యాసములనిప్పించుచున్నారు. వీటినివినుటకు మీరుపోవకుడు. ఈ మె సగాంద్రవలలోన పడిచెడిపోకుడు. భద్రము.

ముని:— యోగీంద్రా! మీదయచేతమాకు విద్యాబుద్ధులు చక్కపడి, పరిశుద్ధవృత్తులలోనున్నారము. మాయందు స్థిరపడియుండునట్టి భక్తి విశ్వాసములను, యీలాటినూర్గురుసిద్ధాంతులైనను ఆలాటి పదుగురు రాజగురువులైనను, చలింపజాలరని, నమ్ముడు.

ప్రేమ:— అట్లయిన, మీకుశుభమగును. (ఇద్దఱు పోవుదురు)

---

## అంకము 1. రంగము 3.

### ప్రవేశము— సదాశివదీక్షితుండు

సదా:— పాట.

సొగసుగంటిరే! విగతదోషులారా!
అగణితముభీమ నగరవైభవము||

ఇది చిత్రనళీయములోని ఇందుప్రిని పాట. నేను అరవిందపురము విడిచి, పెండ్లికూతురగు శారదాదేవివెంట యీఅస్త్రగిరికివచ్చి, పురములోనికిప్రవేశించిన వెంటనే పురవైభమునకుమనస్సునకత్యంతానందము జనించి యీపాటపాడ దొడగితిని. తర్వాత, పెండ్లికూతురుని మదనచంద్రుడు, రాణివాసములోనికితోడ్కొనిపోకుండ తనపురోహితుని యింటిప్రక్కనుండునట్టి మహాలులో విడిదిచేసియుంచినది చూచి, సుదేవుని పాటపాడవలసి వచ్చినది.

పాట.

ఎంతదుర్దినమో-సంతాపఘనమొ
యెంతనినామది-చింతసేయుదుహరి||

ఈయాపదయంతయు సాంబమూర్తివల్లనేకలిగెను. వలదురా! వలదురా! అని, నేనెంత చెప్పినను సాంబమూర్తి వినకపోయెను.

పెండ్లికూతురు యొక్క దుఃఖమునుచూతునా? నాపాత్రిణముమీా దికివచ్చియుండుటదిచూతునా? రాని, ఆసాంబమూర్తి. వానితల పగలగొట్టి, నానెత్తిని పగలగొట్టుకొనెదను.

ప్రవేశము-సాంబమూర్తి

సాంబ:— సదాశివా! ఇదేమిరాద్ధాంతమురా నీది? నేనులేనప్పుడు, నాయింటిదానితో యేమెమొకొండెములుచెప్పి, ఆలుమగలకు కలహముపెట్టుచున్నావు కదరా? ఇంక యీాయూరిలో నీకేమి పనియున్నది? నేడేనీయూరికి వెళ్ళిపోమ్ము లేకున్ననీతలకాయ పగలగొట్టెదనుచూడు.

సదా:— మొదలునేనే నీనెత్తికాయపగలగొట్టెదను.

సాంబ:— ఎందుకు?

సదా:— ఇందుకు-చూడుము దీనిని-వధూవరులు పురములోనికి వచ్చుచుండగనే రాజగురువులుపంపినారనిచెప్పి, మఠముతిండీడు యీాఆజ్ఞాపత్రికను మదనచంద్రునకిచ్చినాడు.

సాంబ:— దీననేమున్నది?

సదా:— గొప్పపిడుగున్నది చదువుము.

సాంబ:— నీవేచదువుము.

సదా:— (చదువును)

మదనచంద్రునకు శ్రీరాజ గురువులవారు పంపినఆజ్ఞాపత్రిక.

మదన చంద్రా!

నీజనకుఁడులేనప్పుడు, మాకు దెలుపక, మాఅనుజ్ఞనుపొందకుండ, అరవిందపురము రాజగు, భైరవసింహుని కుమారిని శారదను నీవువివాహముచేసుకొని అనేక అనర్థములకు కారణభూతుఁడవైయున్నాఁడవు. భైరవసింహునితండ్రి ఉగ్రసింహుఁడు శూద్రుఁడు, భైరవసింహునితల్లి మనోరమ బ్రాహ్మణస్త్రీ ఇందువలన భైరవసింహుడు చండాలుడగును. చండాలసంబంధమును కూర్చుకొన్నందున శారదతోపాటు నీవుచండాలుఁడుగను అస్పృశ్యుఁడుగను నున్నావు. ఇట్లని మేము శాస్త్రరీత్యానిర్ధరించియున్నాము. కావున నీవు భోగిచంద్రుని ప్రతినిధిగ అస్తగిరినిపాలించుటకు యోగ్యుఁడవుకావు

"ఈవిషయము నేనుభోగిచంద్రునకు వ్రాసి తెలిపిఅతనిని పిలుపించు చున్నాడను. నేటినుండి, నీవు రాజసింహాసనము నంటకూడదు. శ్రీకృష్ణదేవాలయములోనికి ప్రవేశింపకూడదు. శారదను రాణివాసము లోనికి కొనిపోకూడదు. ఈయాజ్ఞ నిప్పుడు నీకుమాత్రము తెలిపి, భోగిచంద్రునిరాకను నిరీక్షించుచున్నాము. దీనికివ్యతిరిక్తముగ నీవు నడచితి వేని, నీకుమహానరకప్రాప్తియగుటయేకాక, బ్రహ్మణశాపమున. అస్తగిరిసంస్థానమే దహింపబడునని తెలిసికొనుము.

(ముద్ర)

భాద్రపద బహుళ అమావాశ్య శ్రీబ్రహ్మశంకరకేశవస్వాములవారు.

(చదువుముగించి) ఇంత చేటు తెచ్చినదినీవే

సాంబ:— నేనేమిచేసితిని?

సదా:— భోగిచంద్రరాజు వచ్చువరకు, మారాజకుమారియొక్క పెండ్లిచేయరాదని, నేనుయెంత చెప్పినను నీవువినకఅవసరపడితివి

సాంబ:—అవసరపడినదినేనా? రాజగురువులయిష్టప్రకారము, నేను జరిపితిని. నీవును సమ్మతించితివి. నేనుతింటిని. నీకుతినిపించితిని. నీదియెంతో, నాదియునంతె. దీనిలోనాదేమి తప్పున్నదిరా?

సదా:— అట్లయిన, రాజగురువులను బయలునకీడ్చి, మనముతప్పించుకొందము, గురువుచుపట్టియిత్తము.

సాంబ:— ఇదిచేసినపెండ్లిరా! వ్రాసినఅక్షరాలుకావు, తుడిచివేసి తప్పించుకొనుటకు. అదియునుకాక. మనవట్టిమాటలతొ గురువు పట్టుపడునా? అల్లరిచేసితివేని, యిప్పుడుమనము కూడబెట్టిన సొత్తంతయు పోగొట్టుకొని, ముందటిఆదాయము గిట్టిపోయి, పొట్టలుకాలి, చచ్చునట్టిపనియగును. నీపుణ్యమవును; యీమాట మరలననకుము,

సదా:— ఆ మదనచంద్రుడు నన్నుచూచి, మిరింగుటకేవచ్చు చున్నాడే. ఈఆజ్ఞాపత్రికకు నేనేకారణమని నన్నుగద్దించుచున్నాడే.

సాంబ:— నీవేకారణముకానిమ్ము ఇప్పుడేమైనది?

సదా:— ఆపెండ్లిచేయుంచి నందుకు, నాశ్రాద్ధముజగునట్లున్నది ఇంతకన్ననింకేమికావలెను?

సాంబ:— నీకెందుకురా యింత ఆరాటము?

సదా:— మదనచంద్రుడు భయపడి, శారదాదేవిని అంతఃపుర ములోన నుంచలేదె;

సాంబ:— మంచిదాయెను. ఇప్పుడుంచకున్న నేమాయెను? కొంచె మునిదానింపుము అంతయుసరిపోవును.

సదా:— ఏమిమాటరాయిది? వేశ్యాస్త్రీనియుంచినట్లు వేరేగృహ మందు యువరాజు తనధర్మపత్నినియుంచియున్నాడే నేనుమా యూరికిబోయి, మారాజుభైరవసింహునితో యేమనిచెప్పుదును?

సాంబ:— ఆతురపడకుము. ఆవిషయము నేనుయోచించుచునే యున్నాను. నీవుయూరికిపోతివేని. సాధ్యమైనంతవఱకు, యేమి యు యీవిషయమును చెప్పకతప్పించుకొనిచూడుము. విధిలేక చెప్పవలసివచ్చెనేని, "ఆరునెలలు గురుమౌఢ్యం" అదితీరువఱ కు పెండ్లికూతురు అంతఃపురములోనికి ప్రవేశించునది నిషిద్ధం అనిచెప్పుము.

సదా:— ఓరి నీయిల్లు బంగారుకాని. గురువు అస్తంగతంకానిదే, అబద్ధమువెట్లుచెప్పవలెనురా?

సాంబ:— ద్రవ్యం "హస్తంగతం" అయినప్పుడు గురువు "అస్తం గతం" కాకపోవునేమిరా? పంచాంగములను మనముచేసినా మా? లేక పంచాంగములే మనలనుచేసియున్నవా? వెఱ్ఱివాఁడా! మనముజోస్యులము అనునట్టిపేరునకే అపకీర్తి తెచ్చునట్టిమాట లాడుచున్నావే? ఇదిగో "అయిదువందలు హస్తంగతం" తెలిసెనా?

సదా:— ఇదిమొదలేయెందుకు చెప్పలేదురా? ఈలాగుగణితము వేసినప్పుడు గురువు, శుక్రుడు యిద్దఱును, మనమురమ్మనిపిలుచు వఱకు అస్తంగతులు కాకపోవుదురా? ఈవిషయము పరిష్కా రమాయెను, కాని, రాజగురువు యిప్పుడు ఆడించుచుండునాటక ములో ముందుయేవేషము రంగస్థలమునకువచ్చునో, తెలుసు కొనినావా?

సాంబ:— ఆపీడనాకెందుకురా? ఏవేషమువచ్చిననాకేమి? నీకేమి?

సూత్రధారుడు గంటవాయింప తెరపైనికి యెగసినప్పుడు, ఆవేష ము తనంతటతానే బైలునకువచ్చును. వేషాలుబయలునకు వచ్చినట్లంత, మనకు......ఏమిచెప్పుము?

సదా:__ వరహాలు.

సాంబ:__అంతే! సదాశివా! శారదాదేవి పరమసాధ్వి. పతిమాట ను జవదాటక, ఆరుమాసములు వేరేగృహమందు, కాపుర ముండుటకు సమ్మతించియున్నది.

సదా:— రాజగురువు శారదదేవిని చండాలస్త్రీ అనుచున్నాడే ముందేమగునో కదరా?

సాంబ:— సదాశివా! నన్నుద్రవ్యపిశాచము పట్టుకొనియున్నను, నాహృదయమందు దయా ధర్మములున్నది. ఈ రాజగురువుల యొక్క శాస్త్రి జ్ఞానమును చించి చెండాడునట్టి యోగీంద్రు డొకడున్నాడు నేనుచూచువఱకు చూచెదను. సంపాదించువరకు సంపాదించెదను. చివరకు ఆపతివ్రతారక్షణకైనా ప్రాణమైన ఆహుతిచ్చెదను.

సదా:__ శారదాదేవికి జతగనే స్త్రీయైననున్నదా?

సాంబ:__ మన వసంతుని భార్య భారతియున్నది.

సదా;__ సరి సాంబా! ఈయారుమాసములు నేనీపురమునందే యుండెదను. నారాజునకైమైనను క్షేమసమాచారము వ్రాసి పంపెదను.

సాంబ:__ ఇచ్చటనీవు యెవ్వరియింటియందుండెదవు?

సదా:__ ఏల? నీయింటియందెయుండెదను.

సాంబ:__ మరేమియులేదు నాభార్యగర్భిణికదరా?వంటచేసేవారె వ్వరునులేరే?

సదా:__ నా అయిదువందలలో, ఆరుమాసముల గ్రాసముయొక్క ద్రవ్యముచెల్లువేసెదను.

సాంబ. — అట్లయిన సరి.

సదా:__ ఇప్పుడు నీదయాధర్మమెక్కడ పోయెనురా?

సాంబ!__ నీవు ఆడదానివైనప్పుడు ఆదయను చూపెదనులెమ్ము రమ్ముపోవుదము. (ఇద్దఱు పోవుదురు)

## అంకము 1 రంగము 4

### అస్తగిరిలో శారదాదేవి యిల్లు

శారద:- నాప్రాణనాథుని యాజ్ఞ మీారజాలక, నేనీమూఁడుమాస ములు యీగృహమందు నివసించితిని. నాపొరుగింటిపురోహి తుని పుత్రి భారతీమాయి నాకుతోడుగవచ్చి ప్రొద్దుపుచ్చక నుండెనేని, యీగృహవాసమునాకు కారాగృహవాసమగుచు నుండెను. నేఁడు నానాథుఁడు నన్నురాజగృహమునకు రాణి వాసమునకు తోడ్కొనిపోయెదనని వచన మిచ్చియున్నాడు. నేను రాజాంతఃపురము జేరితినేని, నాపరువమురక్షితంబగును. ఈచెఱవంటికాపురము, నేఁడు కడతేర్చుటకై శ్రీకాంతుని భజించెదను.

పాట. అనుబంధము 5.

(పాటనిలుపగనె) ప్రవేశము భారతి.

భారతి:- శారదా! నేను వచ్చుచుండగనె నీపాట యేలనిలపితివి? నేనువినరాదా?

శార:- మాయీా! నీపాటవినవలెనని, నాపాటను నిలిపితినమ్మ.

భార:- శారదా! నేను నాపాటపాడితినేని నాబుద్ధిమాఱిపోయి యుండునదికాక నీబుద్ధిసహితము మాఱిపోవునో యేమో?

శార:- అదియెట్టిపాటమ్మ?

భార:- నానాథుఁడు ప్రేమచంద్రయోగివెంట తిరుగుచు నింటికి వచ్చునదేకష్టముగనున్నది. దీనిచింతయే నాకుపాటగానున్నది.

శార:- దీనికి చింతయేలనమ్మ? నీప్రియుఁడు ఆ మహాత్మునియా శ్రయించియుండునది, బహుయోగ్యమైన కార్యమని సంతసిం పుము.

భార:- నామదికి నిశ్లేతోచినది కాని మాబ్రాహ్మణ పండితులకిది సరిపడదు. ప్రేమచంద్రయోగి చండాలులకుగురువై వారిలోకల సి అస్పృశ్యుఁడైయున్నాఁడని వచించుచు, ఆయోగిని నిందించి నానాథునిదండించుచున్నారు.

శార:- భారతీ మాయీా! మీావారుపేరునకు పండితులుకాని, వారి యందజ్ఞానులనేకులున్నారు అట్టివారికండ్లకు జ్ఞానబోధకుఁడగు

యోగి అస్పృశ్యుఁడుగ కానిపించకపోవునా? ఆత్మవిచారమునె దూరముగ నుంచినవారు, మహాత్ముని దూరముగను చకుందురా? అమ్మా! ఎవ్వరేమనిమూరినను ఆయోగీంద్రునియొక్క కృపనార్జించినట్టి నీనాథుడు వసంతసోమయాజి మిగుల ధన్యుఁడనినమ్ముము.

భార:- శారదా! ఇట్టిదృఢమానసంబుననే, రేపు నేనుచేయునట్టి సావిత్రీవ్రతసంతర్పణకు, ఆయోగీంద్రునకును, అతనిశిష్యవర్గమునకును,నానాథునితో ఆమంత్రణనిప్పించితిని.

శార:- మాయీ! నీమనోస్థయిర్యముస్తవనీయము. (అనియోచించి) సంతర్పణరేపేనా? అమ్మా! నేడునేనీగృహమువదలివేఱుగృహమునకుబోయెదను. నీయింటియందా యోగీంద్రుని దర్శించునట్టిపుణ్యము నాకులేకపోయెనే?

భార:- ఇదియేమి శారదా? ఇట్లుఆకస్మికముగ పయనముచేయుచున్నావు?

శార:- అవును, ఈవిషయము నేనుపోవునప్పుడు చెప్పెదను.

భార:- శారదా! నీజ్ఞాపకార్థము నీగుఱుతునేదైననాకిమ్ము. నేను చిత్రించిన శ్రీకృష్ణపటమును నాగుఱుతుగనీకునేనిచ్చెదను, ఇదె పోయితెచ్చెదను (అనిపోవనున్న)

శార:- అంతవసర మెందుకమ్మ? మొదటనాగుఱుతు నేనునీకిచ్చెదను. దానినిచేకొని పోవుదువులెమ్ము. కూర్చునుము. (అనిలోనికిపోయి యొకపేటికతెచ్చి) అమ్మా! ఇదిగోనాగుఱుతు. చేకొమ్ము (అపేటికనిచ్చి నమస్కరించును)

భార:- (పేటికతెఱచిచూచి) ఇన్నిఆభరణములు నాకిచ్చెదవెందుకమ్మ?

శార:- మాయీ! ఇవియొకవారపు సొమ్ములు. నాకింకను రెండు జతలుగ పదునాల్గువారముల ఆభరణములున్నవి. నీవుబ్రాహ్మణగృహిణివి, పూజ్యసతివి, నేనీగృహమువిడచిపోవునప్పుడు నిన్ను పూజించి నీయాశీర్వాదము పడయుటకు నేనుద్దేశించియుంటిని, దానినేయొనర్చితిని దీనినిస్వీకరించి నన్నాశీర్వదింపుము (అని మ్రొక్కును).

భార:- దీర్ఘసుమంగళీభవ! (అనిదీవించి) శారదా! ఇప్పుడునాపాట
ను వినుపించెదను (అనిపాడును)

పాట— అనుబంధము 6.

(పాటనిలపి) శారదా! నాకుమిక్కిలి ఆశ్చర్యమగుచున్నది. పదు నైదువారముల ఆభరణములను నీవు సంపాదించితి కద?

శార:- నేనేమియు సంపాదించనేలేదమ్మ. ఇదంతయు నాభర్తనాకి చ్చిన స్త్రీధనము.

భార:- శారదా! నీకువివాహమైనదా? భర్తయున్నాడా?

శార:- ఉన్నాడమ్మ,

భార:-అట్లయిన, మనయువరాజు నీయింటికేలపుకువచ్చుచున్నాడు?

శార:- యువరాజునే నేను వివాహముచేసుకొన్నాను. అతడే నా ప్రాణనాథుడు.

భార:- ఏమి? ఏమి? మదనచంద్రరాజు నీనాథుడా? నీవు అంతఃపు రమువిడచి యిచ్చటనేలయున్నావమ్మ?

శార:- ఆవిషయము నీకు నేడె తెలియవచ్చును. నిదానింపుము నేను పతియాజ్ఞను యిన్నిదినంబులు జరిపితిని.

భార:- అట్లనా? శారదా! కాదు, రాజపత్నీ! నేనిదివఱకు నీవిషయ మేమనుకొనియుంటినో చెప్పుటకు సిగ్గగుచున్నదమ్మ.

శార:- ఇంకేమనుకొనియుందువు? నన్ను వేశ్యగా తలచియుందువు, కానిమ్ము, నీకృష్ణపటము నాకు తెచ్చియిమ్మ.

భార:- (పోవును)

మదనచంద్ర:- (ప్రక్కనుండి భారతిత్వరగాపోయినదిచూచి భ్రాంతుడై) (స్వ) ఆహా! నాకన్నులయెదుట తళక్కనిమించి మఱు గైపోయినది యెట్టిలావణ్యరేఖయైయుండును? నేనుస్వప్నమును కంటినాయేమి? నిద్రలేక స్వప్నముకలుగునా?

పాట—అనుభంధము 7.

(పాడిలోనికిపోయికూర్చుని) శారదా! నీవుసాకిన బంగారుచిలుక యిప్పుడెయెగిరిపోయెనె నీపంజరములోనచూడుము.

శార:- నాథా! నేనుఏచిలుకను సాకలేదు. నాయింటపంజరమేలేదు.

మదన:- అట్లయిన మొఱపుతీగ మించియుండవచ్చును.

శార:- నాథా! ఆమెఱపునుమఱచి నాతోమాట్లాడుము. రథము తెచ్చినాడవుకద?

మదన- రథమెందుకు?

శార:- నన్నుతోడ్కొనిపోవుటకు?

మద:- ఎచ్చటికి?

శార:- మఱచితివా? నీవువిధించినట్టి ఆఱుమాసములగడువు నిన్నటితోకడచనెను. నేడునన్ను రాణివాసమునకు గొనిపోవలెను కద?

మద:- నేనుమఱచియుండవచ్చును, అయినను, నేడేపోవలెనునట్టి అవసరమేయున్నది? నిదానముగనెన్నడైన పోవచ్చును.

శార:- నాథా! నేనునీకు ధర్మపత్నినైనందున, నీయాజ్ఞనుమీరజాలక ఆఱుమాసములిచ్చటనుంటిని ఇకనేనిందుండనోప . నన్నిప్పుడేతోడ్కొనిపోయియంతఃపురమును జేర్పుము. నిన్నువేడికొందును.

పాట—అనుబంధము 8.

మద:- కాంతా! నీకిచ్చట సుఖములేదా?

శార:- లేదు. లేదు. నాకుసుఖములేదు, నెమ్మదిలేదు. యువరాజుయొక్కధర్మపత్ని రాణివాసముమాని వేశ్యవలె వేరుగృహమందుండునది మర్యాదయగునా? నన్నిట్లుంచునది నీకుధర్మమా?

మద:- కాంతా! నాకంతయుతెలుసును. శంకింపకుము. ఇంకకొన్ని దినములుసహింపుము.

శార:- నాథా! నేనింకనొక్కగడియయైనను సహించియుండజాలను.

మద:- కాంతామణీ! ఇట్లునిక్కచ్చిచేయకుము. విధిలేకనిన్నింకను కొంతకాలమిట్లుంచవలసియున్నది.

శార:- అంతవిధిలేని విషయమేమున్నది?

మద:- నాజనకుడు యాత్రనుండి వచ్చేసినతర్వాత నంతయుచెప్పెదను. ఇప్పుడు మాత్రముత్వరపడకుము.

శార:- నాథా! నీకునాయనకలదు నీవిప్పుడుచెప్పనేవలయును.

మద:- ఈనిర్బంధమువలన నీకు మేలుకలుగదు.

శార:- ఇప్పుడుమాత్రమునాకు మేలున్నదా? నామదియందుండు సంతాపము నీకుకానరాదు. నన్నిప్పుడు త్రోసివైచి నిరాపులకు నిర్బంధమేముండునది దాచకచెప్పుము. నీవుచెప్పువఱకు నేను వదలను.

మద:- కాంతా? నీవుమిక్కిలి నిక్కచ్చిచేసి, నానోటనుండి పలుకించుచున్నావు. కావునవినుము. మనవివాహమును రాజగురువులవారు అంగీకరింపలేదు.

శార:- అంగీకరింపకుండుటకు యేమికారణము?

మద:- భైరవసింహునితండ్రి శూద్రరాజట,

శార:- అయిననేమాయెను? శూద్రరాజులెందరో యున్నారుకద?

మద:- అదిసరి. భైరవసింహునితల్లి బ్రాహ్మణస్త్రీయట.

శార:- అట్లయిన నాతండ్రివంశము పవిత్రవంసమాయెను.

మద:- అటుకాదట. శాస్త్రరీత్యాజన్మముచేత నీతండ్రిచండాలుడట. అందుచేత నీవుచాండాల స్త్రీవట. నాకు నీవుధర్మపత్నికాజాలవట.

శార:- ఇదియేమిపిడుగుపాటు? నాథా! ఈమాటమెవ్వరనిరి?

మద:- ఇట్లనిరాజగురువులు ఆజ్ఞాపత్రికపంపియున్నారు.

శార:- ఏమి. ఏమి. ఇదియెట్టికౄరాజ్ఞా! ఈఆజ్ఞకు నీవేమిచేయనున్నాడవు.

మద:- అందుకేనాజనకుడు రావలెనంటిని. అతఁడు యేమనునో చూచెదను.

శార:- ఒకవేళనీజనకుడు గురువాజ్ఞకులోబడినట్లయిన నీవేమిచేసెదవు? నీజనకుడు బ్రాహ్మణులకు దాసుఁడే నన్నునట్టేట చెయ్యి విడిచెదవా ఏమి?

మద:- కాంతా! నాజనకుని ఆజ్ఞనునేను మీరవలయునా?

శార:- నిన్నునమ్మి నీకు తనప్రాణమునే సమర్పించినట్టి నీపత్నియొక్క బ్రతుకును సార్థకముచేయుటకై యెవ్వారి ఆజ్ఞనైనను నీవుమీరవలయునుకద?

మద:- కాంతా! నాజనకుడేమియాజ్ఞాపించినను నేనుమీరజాలను దానికిబద్ధుడనయ్యెదను

శార:- హా! దైవమా! (అనిమూర్ఛిల్లును)

ప్రవేశము భారతి (కృష్ణపటముతో)

భారతి:— శారదాదేవి! (అనిపిలచుచు లోనికిబోయి మూర్ఛిల్లిన శారదను హెచ్చరింపబోవగా)

మద:— కాంతారత్నమా! శారదనిద్రించుచున్నది హెచ్చరింప కుము ఆయాసపడును.

భార:— (పోవనుయత్నింపగ)

మద:— నారీమణీ! నిలువుము. పోవకుము. నీవెవ్వరవు?

భార:—నేనువిప్రవనితను. శారదాదేవికి సఖిని. భారతియనుదానను

మద:— నీవు నాశారదకు సఖివైయుండియు నన్ను కాంచినంతనే వెడలిపోవచ్చునా ? నాపైననీకింతకోపమా?

భార:— యువరాజా! మీపైన నాకుకోపమెందుకు.

మద:— కోపముకాకున్న భయమా?

భార:-రాజేంద్రా! భయమునుకాదు, మీయెడనుండు గౌరవము.

మద.—నాయందు గౌరవముండిన నన్ను విడచి పోవకుము.

భార:-గౌరవమున్నందుననే నేనిచ్చట నిలువకుండపోవనేవలయును.

మద:-ప్రియా! ఇది గౌరవముకాదు. ఉదాసీనము.

భార:- (కోపమున) అవును, యిప్పుడు ఉదాసీనము, మరి అస హ్యము.

మద:—ఎందు కసహ్యము?

భార:—నన్ను ప్రియా, అనినందుకు.

మద:- అట్లయిన నిన్ను "సుందరీ" అనెదను,

భార:- నేను నిన్ను "ఓరీ" అనెదను.

మద:- భారతీ అందును.

భార:- నేను దుర్మతీ అందును.

మద:—నారీరత్నమా! అస్తగిరి యేలగల భూపాలునితోడ నీవిట్లు పలుకవచ్చునా?

భార:- అస్తగిరికి తండ్రివలె నుండునట్టి, రాజపురోహితునియొక్క పుత్రిని. నీవు పరిభవింపనెంచవచ్చునా?
మద:- నేను రాజునుకానా?
భార:- నీవారాజువు?
మద.- కాను, కాను పొరపడితిని. నీముఖరాజుముందట నేను నీ దాసుఁడనుసుమ్మా. నీవుభాసురంబగు రతివైయుండ, యీమదను నకేమగుదువో చెప్పుము.
భార :- (అపహ్యాముున) ఛీ నీచాత్మా! నీమదము దహింపబడుగాక. (అని ప్రక్కకుజరుగును)
మద:- మోహనాంగీ! నన్ను బాధింపకుము. రమ్ము-పలుకొమ్ము.
భార:- పలుగాకి! దూరమునిలువుము.

ఇద్దఱిపాట-అనుబంధము 9

మద:- చెలువా! నామనస్సు నన్నుబాసి నిన్నుచేరియుండగా, నేను దూరముండగలనా? నీముద్దులమోమును తిలకించినంతనే కాంతుఁడు నాదేహప్రాణంబులను, నీచరణములచెంతనిడి నన్ను నీ యంతరంగదాసునిగ గావించియుండ, నిన్నువిడచి నేను పోవ గలనా? రమ్ము తడయకుము.
భార.- (శారదవెనుకకుబోయి) కలుషాత్మా! ఇట్టిపలుకులు నీవు మరలనాడితివేని, నీనాలుక పుచ్చిపోవును. నీవు నన్ను తాకుటకు వచ్చితివేని, నీచేతులు కూలిపోయి, నీదేహము కాలిపోవును
మద:- ఇందీవరాక్షీ! నాచెయిదమును నీవు వందించుచున్నావో లేక నిందించుచున్నావో నేనెఱుగను కాని, నీముఖమునుండి వెడలుచుండు భాషణములందుండు మనోహర మధురస్వరము నా వీనులకు భూషణమై, నామదికి నానందము నొందించుచున్నది. మదిరాక్షి! నీదూఱుల ఉరువడికి నేనోర్వగలనుకాని, మూరుని చిడిముడికి నేనోర్వజాలనుసుమా.

పాట-అనుబంధము 10

భారతి:- దుష్టాత్మా! ఇట్టి పాపపువచనంబులను నీఅప్పచెల్లెండ్లయెడకుపోయి నుడువుము. నన్ను నాయింటికిపోవనిమ్ము. లేకున్న సజీవయగు భారతిని నీవు స్పర్శింపజాలవని దృఢముగనమ్ముము

మద:- ఓసీ! ఘుమ్మెలాడీ! నీవుమధురవాణివి అని నీనెయ్యముగోరి, నీతో తియ్యనిపలుకులు నుడివినందుకు నీవు విషముక్రెక్కెదవా? నీవు కుసుమాంగివని సరసమాలాడినందునకు కొనరి కొసరి పరుసంపువాక్కులు కూసెదవా? నాప్రభుత్వ ప్రాబల్యంబును అడచుకొని నిన్ను ప్రార్థించుకొలది నన్ను అనర్థమునకు పురికొల్పెదవా? ఇక్కడ యేడక్కడ్డీడు నీకు దిక్కున్నాఁడని నన్ను ధిక్కరించెదవు? ఒక్క నిమేషమాత్రంబున నేను నిన్ను పరిభవింపనేరనా? నీవు నన్ను నిరోధింపగలవా? రమ్మి నాకౌగిటికి (అని పట్టబోవ)

భార:- (శారదను మేలుకొలిపి) శారదాదేవీ! లెమ్ములెమ్ము. ఇదెచూడుము నీనాథునిదుడుకును. తల్లీ! నన్నురక్షింపుము రక్షింపుము.

శారద:- (లేచికూర్చుని) నాథా! ఇంతటి అనర్థకార్యము నీవుచేయుదువని నేనుతలంపలేదు. ప్రజారక్షకుడగు నరపాలుడు యింతటి అధర్మమునకు పాల్పడవచ్చునా?

మద:- తరుణీ! ఈతరుణమున నన్నునీవు నిరసించివచించునది, నీదే అధర్మము. నీవునాధర్మపత్నివైనదే నిజమైనచో, యీభారతిని నాచేతులకప్పగించి నీవువెడలిపొమ్ము.

భారతి:- దేవీ! నాకునీవేదిక్కు. నన్నుకాపాడుము.

శార:- మాయీ! భీతిల్లకుము. నేనవీరరాజ కుమారిని కాని, కుంటెనకత్తెనుకాను. (మదనునితో) నాథా! నేనునీకుధర్మపత్నిని కావుననే, పతియొక్క అధర్మకృత్యమును ప్రతిబంధించెదను. నీదుడుకునుడుగుము నామేనప్రాణముండుదాక, యీసాధ్వీమణిని నీస్వాధీనమునకు నేనియ్యను.

మద:- అతివా! నీవునాయాజ్ఞను మీరెదవా?

శార:- నాథా! పతియాజ్ఞకన్న నధికంబగునాయంతరాత్మ యొక్క ఆజ్ఞను నేనుమీరజాలను. దానిని నేనునెఱవేర్చెదను.

మద:- ఈసుదతినివదలి నీవుపోయెదవా లేదా?

శార:- ఈమెనాప్రాణమే నేనెట్లువదలుదును?

మద:- నీప్రాణము యీమెయందుండిన, నాప్రాణము యీమె యందులేదా? ఒకదేహమున రెండుప్రాణములుండనేరవు. రెంటిలో నొకటి పొయ్యేతీరవలెను. కావుననీవుసిద్ధముగనున్నావా?

శార:- దేనికె?

మద:- నీప్రాణమును పోకడపెట్టుటకు.

శార:- సంతోషముగ సిద్ధురాలనై యున్నదానను.

నాథా! నీపత్నియగు నేను, నీచేతమరణించుటకన్న నధికమైన పుణ్యమునుసంపాదింపగలనా? నన్నుమనుమాడి నీవుసుఖంబుగ మనుము (భారతితో) మాయీ! అదిగో చూడుము. అచ్చటనా నాథుని ఖడ్గమున్నది. దానిని చేకొనిరమ్ము.

భారతి:- (తటాలునపోయి. ఖడ్గముచేకొని, యొరనుండితీసి ఝళిపించి మదనచంద్రుని యెదిరించి) యువరాజా! ఇప్పుడీభారతి, ఖడ్గపాణియగు నీమృత్యుదేవతయని నమ్ముము మాయిద్దఱి ప్రాణములు భద్రములై యున్నవి. నీవుకదలిన నీతలచీలును. నీకుప్రాణముపైన నాశయుండిన శీఘ్రముగ వెడలిపొమ్ము తడసిన మడిసెదవు.

మద:- (కన్నులెఱ్ఱగచేసి భారతినిచూచును)

శార:- (మదనచంద్రునిచేతులు గట్టిగాపట్టుకొని) ప్రాణనాథా! నాసుఖమును చూడుము. (అనివేడుచుండగా).

భార:- (తటాలున వెడలిపోవును).

(తెర జారును)

---

### అంకము 2 రంగము 1

వీధిలో ప్రవేశము.

చండాలబాలుడు—బాలిక—ముత్తుసామి—గంగుబాయి
చేతులయందు పుస్తకములతో

ముత్తు, గంగు:- పాట. అనుబంధము 11

ముత్తు:- గంగూ! నీవుపాఠము చక్కగచదివినావా లేదా? ఒప్పచెప్పను తప్పితివేని, పంతులవారుకొట్టెదరుచూడు.

గంగు:- తప్పిపోవునదినీవె. దెబ్బలుతినునదినీవె. నేనుపాఠముబాగా చదివి యెంతసొగసుగ వ్రాసినానోచూడుము. (అనిచూపును)

ముత్తు:- (చూచి) ఇదియేమిగంగు? ఇట్లువ్రాసినావు? బ్రాంహణ అనివ్రాసి బ్రాహ్మణునకు సున్నచుట్టినావే? ఇదితప్పు "హ" కు "మ" వత్తు నివ్వవలెనమ్మ బ్రాహ్మణ అనివ్రాయవలెను.

గంగు:- అన్నా! ఆపైభాగమందు బ్రాహ్మణయ్య యెట్లువ్రాసినాడోచూడుము. చండాలఅనివ్రాసి బ్రాహ్మణయ్య చండాలునకు సున్నచుట్టినాడే. అదితప్పుకాదా? "ణ" కు "డ" వత్తుయివ్వవలెనాలేదా? బ్రాహ్మణయ్య చండాలునకు సున్నచుట్టినప్పుడు. నేను బ్రాహ్మణునకు సున్నచుట్టరాదా?

ప్రవేశము—సదాశివదీక్షితులు.

సదా:- (ముత్తునుచూచి) ఏమిరా! బహుసొగుసుగ తెల్లనిబట్టలు వేసుకొని నిక్కుచున్నావు?

ముత్తు:- నాపేరు "ఏమిరా" కాదయ్యా ముత్తుసామి.

సదా:- ముత్తు-పైన-సామి-నీముఖము.

ముత్తు:- నాముఖముయేమైనదయ్యా? శుభ్రముగనున్నది. మీముఖమేపాచిముఖము. మీరు బ్రాహ్మణాలనిచెప్పుకొనెదరే, యింత పొద్దుయెక్కియున్నను ముఖమేకడుగలేదుకదయ్యా?

సదా:- పోరామాలకుంక! నీవా బ్రాహ్మణునితప్పుపట్టువాడవు?

ముత్తు:- ఏమయ్యా? ఉన్నమాటఅనినందుకు తిట్టెదవా? ఇదె చూడు నీబ్రాహ్మణబుద్ధి.

సదా:- నిన్నుతిట్టునది మాత్రమేనా? నిన్నుకొట్టెదనురా. మీరు మాదొడ్లను ఊడ్చునట్టిపనిని యెందుకువిడచితిరిరా?

ముత్తు:- ఆపనికేనా మమ్ములనుదేవుడు సృష్టించినది? మాయిష్టము వచ్చినపనిని మేముచేసెదము. మేము విద్యనేర్చుచున్నాము. సేద్యముచేయుచున్నాము. నూలువడకుచున్నాము. మామనసు.

సదా:- మీరేమివిద్యను నేర్చినారురా?

ముత్తు:- మీరు మఱచిపోయినవిద్యను మేమునేర్చినాము.

సదా:- నేనేమిమఱచినానురా?

ముత్తు:- దేవునికంటికి మీరు, మేము, యొక్క లేలనుమాటమీరు మఱవలేదా?

సదా:- ఈమాటనీకెవ్వడు చెప్పినాడురా?

ముత్తు:- నాకు మీకు అందఱికిని భగవానుడే చెప్పియున్నాడు.

సదా:- ఏమనిచెప్పినాడురా?

ముత్తు:- దేవుడు సమస్త భూతములయందున్నాడనియు, దేవుని యందు సమస్తభూతములున్నవనియు చెప్పలేదా "యోమాం పశ్యతిసర్వత్ర| సర్వంచమయిపశ్యతి॥"

సదా:- చాలుచాలురా. ఆబిచ్చగాడు నేర్పించినచిలుకపలుకులుగా, యివి నాకుతెలుసును. నేనువినలేనురాయివి.

సదా:- అయ్యా! తొలుఁబలుకులేనేర్వలేని మీరు చిలుకపలుకులను యెట్లువినగలరయ్యా?

సదా:- నీతోవాదమునాకెందుకు? ఊరకుండుము.

గంగు:- ముత్తు! ఈఅయ్యావారు మగవానితో వాదముచేయలేడని తెలిసెను (సదాశివునితో) ఏమయ్యా! నీవునాతోవాదించెదవా?

సదా:- ఏమేపిల్లా! నీవుకూడపండితురాలవేనా?

గంగు:- నీవుపండితుడవై యేడ్చినందుకేనానన్ను 'ఏమేపిల్లా' అనుచున్నావు? నీవునాతోమాట్లాడవలెనన్న నన్నుగంగుబాయి అని పిలచి మాట్లాడవయ్యా.

సదా:- మాలపిల్లవు నీకింతరోషమెందుకే?

గంగు:- నిన్ను 'బాపనోడా' అంటెనీకురోషమురాదా?

సదా:- ఇట్టిమాటలు నీకుయెవ్వరునేర్పించిరమ్మా?

గంగు:- మీకు నాకు తల్లియైనట్టిశారదమ్మనేర్పించెను.

సదా:- ఎవ్వతాశారదమ్మ?

గంగు:- బ్రహ్మదేవునిభార్య.

సదా:- ఆమెనునీవుచూచినావా?

గంగు:- ఆమె నానాలుకపైననేయున్నది (అనిపద్యముచెప్పును)

కం॥ వీణాలోచనపల్లవ! పాణ! అలినీలవేణి. పద్మజురాణీ!

అయ్యా! యీపద్యమునుపూర్తిగా చదవండిచూచెదను.

సదా:- (ఊరకుండును)

గంగు:- (నవ్వి) ముత్తు! ఈ బ్రాహ్మణయ్యకు 'ఏణీలోచన' యే రాదు. అయ్యా! ఇంకొక్క టియడిగెదను చెప్పుము. 'విద్యావిహీనః' దీనిని పూర్తి చేయవయ్యా?

సదా:- (కోపమున యూరకుండును)

గంగు:- అయ్యా! మీకు విద్య సున్న అని తెలిసెను. మీకు వ్రాయుట కైనవచ్చునేమొ, యీ పుస్తకమున వ్రాయుడు. ఇదిగో కలము చేకొనుడు (అని కలమునియ్యబోవును).

సదా:- (యెగిరిపడి) దూరముండవే మాలకుంక. నీకలము నేను తాకరాదు.

గంగు:- అట్లెందుకు యెగిరిపడితివయ్యా? నేనేమి పామా? లేక తేలా? నిన్ను కఱచితినా? కుట్టితినా?

ముత్తు:- ఏమయ్యా, మా కలమును తాకరాదనెదవే? మేము వడకిన నూలు పోగులజందెమును నీ మెడలో వేసుకొనియున్నావే?

సదా:- ఛీ! దుర్మార్గా! ఊరకవెళ్ళు.

గంగు:- విద్య నేర్వకున్నను తిట్లు బాగా నేర్చినావయ్యా. ముత్తు! మన మింక ఆలస్యము చేసితిమేని యీ అయ్య వారిగాలి మనకు తగిలి చెడిపోవుదుము. రమ్ము పోవుదము.

(ఇద్దఱు పోవుదురు)

సదా:- (స్వ) బ్రాహ్మణులకు బహుకష్టకాలము వచ్చెను. చండాలురు చదివి విద్యావంతులైనప్పుడు, మాగతి యేమి కావలెను? పంచాంగములను సంచిలో మూసిపెట్టి, జ్యోతిష్కపుస్తకములను నూతిలో పడవేసి, సాముద్రిక గ్రంథములను సముద్రములో కలిపి, చేతిలో పరకపట్టుకొని, మాదొడ్లను మేమే యూడ్చవలసివచ్చునోయేమో? ఊరూరిలో, పల్లెపల్లెలో, ప్రేమచంద్రపాఠశాలలు నిర్మాణములై యున్నవి. అన్నిజాతులవారు నొక్కచోటనే చదువుచున్నారు. మాలలు పరిశుద్ధులైరి ప్రబుద్ధులైరి. ఉపాధ్యాయులునైరి. ఇదేమి యుపద్రవమో తెలియకున్నది. ఇకముందు, మాలమాదిగ బ్రాహ్మణవైశ్యశూద్రులందఱు కలిసి యొక్కటేయగునట్లున్నది.

ప్రవేశము-వసంత.

వసం:- సదాశివా! అందఱుకలిసి యొక్కచోట నెందుకు కాకూడదు?

సదా:- ఓహో! వసంతసోమయాజి. నీవా? నమస్కారము. రాజ పురోహితుని అల్లుడైననీవె యిట్లన్నప్పుడు, నేనేమనవలెను? కాని, నీవు యీయూరికి యెప్పుడువచ్చితివి!

వసం:- నేనిప్పుడేవచ్చుచున్నాఁడను. ఈయూరికినీవెప్పుడువచ్చితివి?

సదా:- నిన్న రాత్రేవచ్చితిని.

వసం:- (ముఖముచూచి) ఇదియేమి? పాడుముఖముతోనున్నాఁడవు? భోజనముచేయలేదా?

సదా:- స్నానమే లేనప్పుడు, భోజనమెట్లుచేయుదును?

వసం:- మధ్యాహ్నము మీరిపోయినదే. యింకనుస్నానమెందుకు చేయలేదు?

సదా:- ఈపల్లెయందుండునది యొక్కటేబావి. దానికిమైలతగిలి యుండగ. జలమా-స్నానమా-పానమా ఏమియులేదు.

వసం:- బావిలోన నెవ్వడైననుపడి శవముతేలియున్నదా?

సదా:- మైలతగులుటకు పీనుగయేలతేలవలెను? మాలవాడు నీళ్ళు ముట్టినచాలదా?

ప్రవేశము-మునిస్వామి.

ముని:- వసంతం! ఇప్పుడేవచ్చితివా?

వసం:- అవును. రమ్ముమునిస్వామి (అనిపోయి చెయ్యిపట్టుకొని ఆదరించును).

సదా:- (స్వ) ఈసోమయాజికి బుద్ధియెక్కడపోయెను? తాను బ్రాహ్మణుఁడై యుండి అస్పృశ్యుఁడగు చండాలునితాకి పైనపడు చున్నాఁడే-పట్టపగలే? రహస్యముగనైననుకాదె? (ప్ర) వసంతా! ఈపురుషుడు యేయూరిసోమయాజి అప్ప?

వసం:- సదాశివా! ఇతఁడు నామిత్రుఁడు. ప్రేమచంద్రయోగియొద్ద విద్యనభ్యసించి, పరిశుద్ధకర్ముఁడై యుండునట్టి ధీశాలియితఁడు.

సదా:- ప్రేమచంద్రయోగియెవ్వఁడు?

వసం:- అతఁడు, శస్తగిరిరాష్ట్రమునందలి చండాలులను ఉద్ధరించి నట్టిమహాత్ముఁడు.

సదా: ఆమహాత్ముఁడు, మాలవానికి విద్యనేర్పించెనా?

ముని:- అయ్యా! మీరుమాలలకు విద్యనేర్పినట్లయిన, అది తప్పగునా?

సదా:- తప్పమాత్రమేనా? కులభ్రష్టుత్వముకలుగును.

ముని:- అట్లయిన మీరుకులభ్రష్టులేకదా?

సదా:- ఏమి? నేనుచండాలునకు విద్యనేర్పినానా?

ముని:- అయ్యా! అప్పుడేమఱచితిరా? నామేనమామ గురుస్వామితో మీరుపదివరహాలుపుచ్చుకొని, అతనికుమారునకు అక్షరాభ్యాసముచేయించుచు, ఆపిల్లవానిచేతిని మీరేపట్టుకొని, అతని తలపైన, "ఓం" అను అక్షరమును వ్రాయించిపలికింపలేదా?

సదా:- (స్వ) గురుస్వామికి వీడేమేనల్లుడుకావలెనా? పిల్లికండ్లు మూసుకొని పాలుత్రాగినట్లాయెను. కాని, రంకుకుబొంకే గురువు. (మునిస్వామితో) అవును గురుస్వామి, గ్రామము పటేలుడు కనుక నేనుచేసినపనితప్పుకాదు.

వసం:- సదాశివ! పటేలుడుచండాలుఁడు కాఁడా?

సదా:- కృష్ణ! కృష్ణ! ఆమాటపలుకరాదు. మాపటేలుడు, మాకు ఐెనధికుఁడు. అతఁడుకలియుగబ్రహ్మకు జ్యేష్ఠపుత్రుఁడయ్యా.

వసం:- సదాశివా! కలియుగబ్రహ్మ అనివేరెయున్నాఁడా?

సదా:- లేకనేమి? కలియుగబ్రహ్మ అస్తగిరిసంస్థానములో యుద్భవించినాడు. దేవలోకపుబ్రహ్మ, కమలమునుంచి పుట్టియుండగ, యీకలియుగబ్రహ్మ మలమునుంచి జనించియున్నాడు. అతడు నిర్గుణుడు ఇతడుసగుణుడు. ఆబ్రహ్మనిరాకారుడై యెవ్వరికన్నుల కునుకానరాఁడు. ఈబ్రహ్మసాకారుఁడై అందఱికిని ప్రత్యక్షమై యున్నాఁడు. ఈబ్రహ్మయొక్క ముఖమునుండి, పటేలుడును బాహువులనుండి పట్వారియును, తొడలనుండి తలారియును, పాదములనుండి తోటీయును, ఉద్భవించినారు. ఈసృష్టివలన, పురుషసూక్తములోని వాక్యముతలక్రిందై, లగాటుకొట్టి, మారిపోయినది. తెలుసునా?

"పటేలస్య ముఖమాసీత్" "బాహూపట్వారస్య కృతః"
"ఊరూతదస్యతలారిః" "పద్భ్యాగ్ంతోటీఅజాయత"

ఇదేచలామణి పురుషసూక్తము. అందుచేత మాపటేలు గురు స్వామిని కలియుగబ్రాహ్మణులలో నేనుచేర్చినాను. చేతిలో వరహాలురాలినప్పుడు, అతనికుమారునకు అక్షరాభ్యాసము చేయించినదే కాక, నామెడలోనిజందెమునేతీసి వానిమెడలో వేయమన్నను వేసెదను. "కాంచానం కర్మవిమోచనం" పటే లు ఆజ్ఞ, సుగ్రీవాజ్ఞ. అతనిఆజ్ఞ మీరిననాడు భార్య-పిల్లలు, నేను పస్తుపడి యేడ్వవలసినదేకాక, ఆయూరిలో నేనుకాపుర ము చేయుటకుశక్యమగునా? పటేలుయొక్క పగవానినిచూచిన అంగడివాడు అమ్మడు. మంగలివాడు మాట్లాడడు. చాకలివా డు చక్కేరాడు. అన్నివిధములైన దక్షిణలు సున్నలై, మిన్ను చూచుచు మన్నుతినిబ్రతుకవలసినదేకదా?

వసంత:- సదాశివా! ఇట్టిపిరికివాడగు నీకు బ్రాహ్మణనామమెందుకు?

సదా:- ఆపేరుఉండవలెనని నేనుకోరినానా? జనసంఖ్యలెక్కలలో నేను బ్రాహ్మణుడనని వ్రాసుకొన్నారు. ఆపేరుమీదనే ఉదర పోషణ భార్య పుత్రులరక్షణ జరుగుచున్నది. భిక్షముకొఱకై నను బ్రాహ్మణుడైననే, కుక్షికికూడుదొరుకునయ్యా.

వసం:- ఏమంటివి? బ్రాహ్మణుడు, బ్రతుకుటకై భిక్షమేయెత్తవలె నా? దేహరక్షణకు కావలసినవస్తువులను బ్రాహ్మణుడు తానుం డుచోటునకే తెప్పించుకొనునట్టి శక్తివానికిలేదా?

సదా:- నాకుచూడ, బ్రాహ్మణుడు బ్రతుకుటకు, ఉండునవిరెండే మార్గములు భిక్షమైననెత్తవలెను. లేక, రాజభృత్యుడై దాస్య మైనచేయవలెను. ఇవితప్పిన వేఱుఆర్జనోపాయము లేవియున్నవి?

వసం:- నీవుచెప్పనది యిప్పటిబ్రాహ్మణులయొక్క మాటగనున్నది

సదా:- ఇప్పటివాడైననేమి? అప్పటివాడైననేమి? బ్రాహ్మణ నా మము యేమైనను మారిపోయినదా?

వసం:- బ్రాహ్మణనామముమారలేదు కాని, బ్రాహ్మణనేమమును జ్ఞానమును గుణకర్మలును మారిచెడినవి అందుచేత బ్రాహ్మణ ప్రభావమేనశించి, నీవనినట్లు బ్రాహ్మణులిప్పుడు నిక్కంపు భిక్షుకులేఅయియున్నారు.

సదా:- అప్పుడుమాత్రము బ్రాహ్మణుడు ధనికులయిండ్లకు భిక్ష మెత్తుటకుపోలేదా?

వసం:- లేదు. లేదు. అప్పుడు. బ్రాహ్మణులు, తాపసులుగను, జ్ఞానయోగులుగను తమఆశ్రమములందెయుండిరి. సన్యాసులుగ నుండిన వారికేభిక్షుకులని పేరుండెను.

సదా:- అట్లయిన, యిప్పటికిని, బ్రాహ్మణులు అనుభవించుచుండు శ్రోత్రియములును, మాన్యములును యెట్లువచ్చెను?

వసం:- పూర్వకాలమున, వేదాధ్యయన సంపన్నులై, జ్ఞానతపో బలంబులను గడించి, దైవబలముసహితము సంపాదించినట్టి బ్రాహ్మణులు, క్షత్రియరాజులకు గురువులై యుపదేశము లొనర్చిరి. రాజులరాజ్యములను బ్రాహ్మణులేకాపాడిరి. ఆ రాజులు, బ్రాహ్మణులకు గురుదక్షిణలుగ శ్రోత్రియాముల నొసంగిరి. రాజరాజైనను, బ్రాహ్మణుడు తనకంటబడెనేని, సింహాసనముదిగివచ్చి భూసురుని చరణములకు నమస్కరించి సత్కరించుచుండెను. అప్పటివిప్రులప్రభావము యెట్లుండెను?

|| మదముచేచరియించు మనుజనాథులనెల్ల-పరశురాముడుత్రొక్కి ధరణిగోల్చె
ప్రతినబూనుచుమింటి ప్రతిస్వర్గమునునిల్పి-వరగాధిసూనుండు పడసె యశము।
క్షోణీశులకుదివ్య బాణవిద్యలనేర్పి-గురుడౌచుద్రోణుండు పరువునొందె।
యోగదండముబట్టి యోధులదునుమాడి-పారసెవసిష్ఠుండు పరమకీర్తి||

గీ। నేడుబ్రాహ్మణులకు వేద-నియతిమాసి।
కపటకర్మలనితరుల-కనులుమూసి।
ధనమునార్జించుకార్యమే-ధర్మమాయే।
పరులనిందించుకర్మయే-భక్తియాయె||

సదాశివ! వేదమంత్రసిద్ధిచేత, గాంభీర్యగౌరవంబులతో జీవనము లొనర్చుచు, రాజులయొక్క మ్రొక్కులనందుకొని రాజుల నాశీర్వదించుచుండినట్టి ఆనాటిబ్రాహ్మణులసంతతివారు యీనాడు, తామేరాజులకును, రాజసేవకులకును మ్రొక్కులిడుచువారిని కొలుచునట్టిదుస్థితిని తెచ్చుకొనియున్నారు.

సదా:- వసంతా! ఇట్టిచెడుగుస్థితిమనకు కలుగుటకు కారణమేమి?

వసం:- ఇందునకుకారణము మనపితరులేఅగుదురు. మనపెద్దలు పరమాత్మమీదిభక్తికన్నను, ప్రపంచముమీదిభక్తినే అధికముగా పెంచి, ప్రపంచకామము సిద్ధించునట్టివిద్యలనేనేర్చిరి. తాము నేర్చినదేకాక, పరంపరగా వారిసంతతి వారికిఅలాటివిద్యలేనేర్పిరి. ఈవిద్యవలన అజ్ఞానమును, అందువలన అధర్మమును సంఘితములై యిప్పటిమస్థితిమనకు సంభవించియున్నది.

సదా:- ఈదుస్థితినిమాన్పుటకొఱకు మనముముందు యేమిచేయవలెను?

వసం:- ముందుమనము చేయవలసినదిచెప్పెదనుకాని, యిప్పుడు మనముచేయవలసినది స్నానమే. ఆకలిబాధనాకు మిక్కుటమైయున్నది. స్నానమునకుపోవుదమురమ్ము.

సదా:- నీవుస్నానమెక్కడచేసెదవు?

వసం:- నీవుచెప్పినబావిలోనేచేసెదను.

సదా:- మైలతగిలినబావిలోస్నానమా? వలదు. వలదు.

వసం:- మాలవాడు బావినీళ్ళను ముటికిచేసినాడని మైలయా? లేక అతడునీళ్ళనుతాకినాడని మైలయా? చెప్పుము.

సదా:- వాడునీళ్ళనుముటికిచేయలేదుకాని, నీళ్ళనుతాకిత్రాగినాడు.

వసం:- వాడుఅనగా, జీవాత్మయా, లేక జడదేహమా?

సదా:- ఆత్మలేనిదే, జడదేహము, కదలనులేదు, నీళ్ళుత్రాగనులేదు.

వసం:- అట్లయిన "నైనంభిందంతిశస్త్రాణి-నైనందహాతి పావకః నచైనంక్లేదయంతి, అపః" అన్నప్పుడు, ఆత్మనుజలముస్పర్శింపగలదా?

సదా:- స్పర్శింపలేదు.

వసం:- ఆయాత్మనీయందును. మాలవానియందును ఉన్నదా?

సదా:- అందఱియందునున్నది.

వసం:- ఆబావినీళ్ళలో ఆత్మయున్నదా?

సదా:- ఆహాఉన్నది "రసొహం అప్సుకౌంతేయ" అన్నాడు. జలరసత్వము ఆత్మయేకదా?

వసం:- ఆత్మకుమైలయున్నదా?

సదా:- లే ు. లేదు. ఆత్మకెక్కడిదిమైల?

వసం:- సదాశివ! మనయందును, మాలవానియందును, బావిజల మునందును, ఉండునట్టిఆత్మకు మైలయేలేదు. బావినీళ్ళు ముటి కిచేయబడలేదు. అసహ్యముగాలేవు. ఇట్లుండశుభ్రమైన ఆనీళ్ళ లో మనముస్నానముచేసిన నేమితప్పుచెప్పుము?

సదా:- ఏమియుతప్పులేదు, బాగస్నానముచేయవచ్చును. నాబుద్ధి కేమైలతగిలినదికాని ఆనీళ్ళకేమియుమైలలేదు. నేనెంతతప్పించు కొందమన్నను, మాత్రాస్పర్శ నన్నువిడువదే.

"మాత్రాస్పర్శాస్తుకౌంతేయ-శీతోష్ణసుఖదుఃఖదాః
సమదుఃఖసుఖంధీరం-సోమృతత్వాయకల్పతే"

రమ్ము. ఆభావిలో మునిగియైనను యీవక్రబుద్ధిని పోగొట్టుకొ నెదను.

ముని:- వసంతా! నాకు సెలవిమ్ము.

వసం:- నీవును మావెంటరమ్ము.

ముని:- ఈదీక్షితుడు యేమనునో?

సదా:- నేను యేమందునా? నీవు నాకంటె యోగ్యుడవుఅందును. రమ్ము పోవుదము. (అని చెయ్యిపట్టి తోడ్కొనిపోవును)

(తెరజారును)

---

## అంకము 2-రంగము 2.

(మదనచంద్రుని మందిరము ముందర-ప్రవేశము-సాంబమూర్తి)

పాట-అనుబంధము 12

సాంబ:- దారిద్ర్యాపేక్షకలవానికి దయాగుణము శూన్యమని పెద్దలు చెప్పెదరు. ఈమాటను అబద్ధముచేయుటకై, నాహస్త ముదరి ద్ర్యపక్షముగను, నాహృదయము దయాపక్షముగనున్నవని అస్త గిరి ప్రజలకు నిరూపించెదను. మదనచంద్రునకు శారదాదేవి మీద నించుకైనను ప్రేమలేదు. అతడవివేకియై కర్ణకఠోరమగు

గురువాజ్ఞను ఆదేవికి వినుపించి, ఆమెను దుఃఖసాగరమున పడ ద్రోసినదేకాక, పతివ్రతయగు పరస్త్రీపైన తనకుగల పిచ్చి, మోహమును తనభార్యయెదుటనే ప్రదర్శించెను. శారదాదేవి యొక్క దుఃఖమునుచూడజాలక నేను ప్రేమచంద్రుని ఆశ్రయించి భారతిని, శారదాదేవిని తోడ్కొనిపోయి యుదంతమంతయు నతనికి నివేదించితిని. ఆయోగీంద్రుడు శారదాదేవికి అభయహస్తమునిచ్చి, భోగిచంద్రునకు తాను నొకపత్రికను వ్రాసి చారునితో పంపియున్నాఁడు. ఆనాటినుండి నేను, లోలోన ప్రేమచంద్రుని ఆజ్ఞానువర్తినై, పైచూపులకు మదనచంద్రునికి మిత్రునిగనటించి యతనిద్రవ్యము నాకర్షించుచున్నాఁడను. వసంతసోమయాజి, శారదాదేవిని, భారతిని, వేదగిరిలో సత్యవతిదేవియొక్క యంతఃపురమునుచేర్చి యున్నాఁడు. అచ్చటినుండియే నేనుయిప్పుడువచ్చినాఁడను. మదనచంద్రుడు దురుద్దేశముతో సత్యవతీదేవిని తనకుపత్నిగా కుదుర్చుమనినాకు చెప్పి అందునకుగాను సంభావనసంచకరువు అయిదువేలు వరహాలిచ్చినన్ను వేదిగిరికిపంపియుండెను. నేను వేదగిరికిపోతిని, మరలివచ్చితిని. ఇప్పుడేమదనచంద్రునిగాంచి, బుడుడాలకవిత్వముచెప్పి యతనినుల్లసింపజేసి మరికొన్నివరహాలను ఊడతీసెదను. ఇదియేనాకడపటిఅదృష్టపరీక్ష. రేపటినుండి మదనచంద్రుడెవ్వడో నేనెవ్వడో? (పోవును)

తెరపైనికయెగయును.

మదన:- నాప్రయత్నయంతయు వ్యర్థమాయెను. శారదయెచ్చటికి పోయియుండవచ్చును? భారతికూడకానరాకున్నదే. వీరిద్దఱును నాచారులకు అగుపడకుండ, యెట్లుమాయమైయుందురు? నేను త్వరపడి, గురువాజ్ఞను శారదకు తెలిపినది నాబుద్ధిమాంద్యము. ఆయమ తనతండ్రియింటికి పోయినదేమొ అని, యచ్చటికి నా చారునొకనిపంపియున్నాను—సేవకా! (అనిపిలచును)

ప్రవేశము—చారుడు.

మదన:- ఓరీ! అరవిందపురమునకు పోయినచారుడు మరలవచ్చినాడా?

చార:- దేవా! నేనేపోయియుండినది. ఇప్పుడేవచ్చితిని.
మదన:- ఏమిసమాచారము? శారదను చూచితివా?
చార:-శారదాదేవిగారు తండ్రియింటికిపోలేదు.
మదన:- తండ్రియింటికిపోలేదా? మంచిది. నీవుపొమ్ము.
చార:- (పోవుచుండ)
మదన:- ఓరీ! యిటురమ్ము.

పునఃప్రవేశము-చారుడు.

చార:- ఏమిసెలవు?
మద:- ఓరీ! నీవుభారతిని వెదకుచునేయుండుము. ఆయమవార్తనీకు తెలిసినవెంటనే వచ్చినాకు తెలుపుము.
చార:- చిత్తము. (అనిపోవును)
మదన:-శారద యెచ్చటనైన డాగియుండి, యెట్టిరచ్చచేయవలెనని యెంచియున్నదోయేమొ తెలియదు. రచ్చచేసిన ఆమెకేచెఱుపగునుకాని నాకేమిభయము? నాకుండునదియొక్కటే భయము. నాజనకుఁడు గురువాజ్ఞకుబద్ధుఁడై నన్నురాజ్యాధికారభ్రష్టునిచేయునేమో అనునదెనాకుభయముగనున్నది. కావున నాజనకుడేతెంచుటకు ముందే నేనువేదగిరిపై దండెత్తి, జయించి సత్యవతినిచేపట్టితినేని, నాకుఅస్తగిరిరాజ్యాధికారమే అవసరము లేదు. వేదగిరిరాజ్యమే శ్రేయస్కరమైయుండును. ఈరాజ్యచింతకన్నను, ఆభారతికై నాకుకలిగిన వలవంతమిక్కుటమైయున్నదే కాని, భారతియెన్నిదినములు దాగియుండగలదు? (అని యోచించి, వేదగిరికిపోయిన సిద్ధాంతియింకను రాకయున్నాడే ఎందుకు తడసియుండును?

(ప్రవేశము-సాంబమూర్తి.)

మదన:- వచ్చితివా సిద్ధాంతీ? నీకు నూరేండ్లాయుస్సు!
సాంబ:- యువరాజా! మీకుమున్నూరేండ్లు ఆయువుండవలెనని నా ఆశీర్వాదముచేసెదను.
మదన:- అంతదీర్ఘాయువు నాకెందుకు?

సాంబ:- మీవంటి వీర, ధీర, సుందర రాజకుమారుని, ఆ సత్యవతీ దేవిపతిగా పడయవలెననిన, ఆయమకు ఒకజన్మముచాలునా? మూడుజన్మములెత్తవలసివచ్చును. అందుకు మూడునూరేండ్లు మీకు ఆయువువలదా?

మద:- సత్యవతి యేమనెను?

సాంబ:- నేనామెను దర్శించి, సంభాషించి, మీరునాకునేర్పినట్టి మాటలు మఱవకుండ పూసకూర్చినట్లు వాకుృచ్చితిని. మీరు రాత్రింబగళ్ళు ఆయమరూపపటము నెదుటయుంచుకొని పూజించుచు, తదేకధ్యానమందె మగ్నులై యున్నారనిచెప్పి, మీరిచ్చిన ఆయమచిత్తరువు నామెచేతికి నందిచ్చితిని.

మద:- దీనికి సత్యవతి ఆమోదించెనా?

సాంబ:- ఆయమసత్యవతికాదు "భూతయువతి" మీరిచ్చిన పటముచూచి, నీసందేశముచాలును వెడలిపొమ్ము. అనిగద్దించెను.

మద:- ఇట్లు ధిక్కరించుటకు కారణమేమిచెప్పెను?

సాంబ:-నీయువరాజుయొక్క వార్తయంతయు నాకుతెలుసును "పిల్లి కన్ను మూసుకొని పాలుత్రాగిన చూచువారులేరా" అనెను.

మద:- నీవూరకయుంటివా?

సాంబ:- నేనుకోపము పట్టజాలక నేనిచ్చిన రూపపటమును వెనుకకిమ్మని బిరుసుగా అడిగితిని.

మద:- వెనుకకిచ్చెనా?

సాంబ:- ఇయ్యలేదు. నారూపపటము, నాశత్రునియొద్ద నుండతగదు. నేనియ్యను పొమ్మనెను.

మద:- నీవేమంటివి?

సాంబ:- ఆయమగద్దింపులబుద్ధిని త్రిప్పవలెనని యోచించి, నేనుమెత్తపడినట్లు నటించి అమ్మా! నిన్నుధర్మపత్నిగ స్వీకరించుటకు మనసార యభిలషించినట్టి యువరాజు నీకుశత్రుడెన్నటికైన నగునా? యువరాజుయొక్క ద్వేషులెవ్వరో, యిట్టిఅసత్యవార్త పుట్టించినారు. యీమాట అపోహము, అనియొట్టుపెట్టుకొని, నాపంచాంగముముట్టి ప్రమాణముచేసితిని.

మద:- ఆయమ నీమాటనునమ్మెనా?

సాంబ:- నమ్మకపోయినదే కాక, పక్కనినవ్వి, నీమదనచంద్రునకు యిప్పుడుండునట్టి ధర్మపత్నియేచాలును పొమ్మనెను.

మద:- నావివాహాము సత్యవతికి తెలిసెనా? కాని, నీవేమంటివో చెప్పుము.

సాంబ:- ఈమాటనన్నడుగవలెనా? 'అమ్మా! మదనచంద్రుడు యిదివఱకు అస్ఖలిత బ్రహ్మచారియైయున్నాడు. అతనికిపత్నియున్నదనుమాట అబద్ధము. పరీక్షింపవలెనన్న అస్తగిరి రాజాంతఃపురములో యువరాజుయొక్క పత్నియున్నదేమో విచారింపుడు. మీరు కొండెములను పాటింపకుడు' అనివాగ్ధోరణితోఊది పలికి, నాయజ్ఞోపవీతము పట్టుకొని, అన్ని దేవుండ్లపేర్లుచెప్పి ఘోరమైన బాసచేసితిని.

మద:- ఆమె యొప్పెనా?

సాంబ:- ఒప్పెనో లేదో తెలియదుకాని, మూతినితిప్పి కన్నులువిప్పి, గొప్పగాయోచించి, చప్పనిమాట నాతోచెప్పెను. ఏమన్న, నామంత్రివిశారదుడు పురమునలేడు. అతడరుదెంచినపిదప ఆవార్త తెలుసుకొని మరలరండు. యిప్పుడుపొండు అనెను.

మద:- ఏమి? ఆమెమంత్రి విశారదుడూరిలో లేడా? నీవువిచారించితివా? ఈమాటనిజమా?

సాంబ:- ఆమెమాట నమ్మజాలక, నేనువిచారించితిని. రెండుసంవత్సరములనుండి విశారదుడూరిలోలేడట. బ్రతికియున్నాడో లేదో యెవ్వరికిని తెలియదని పురజనులనేకులు నాతోచెప్పిరి ఇది వాస్తవము.

మద:-మేలు. మేలు! సిద్ధాంతీ! నాసందేశమువిని నవ్వినట్టి సత్యవతిని నేను నెవ్వలో ముంచగలను. ఆమెగతియేమగునో యింతలోననే నీవుచూచెదవు (యోచించి) ఇదియేనాకు మంచిసమయము!

సాంబ:- అవునని అదిగో బల్లిపలికెను.

మద:- బల్లియేమని పలికెను?

సాంబ:- మీకువిజయకాలము వచ్చినదని పలికెను.

మద:- గౌళిభాష నీకు తెలుసునా?

సాంబ:- గౌళిభాషయొక్కటేనా? పక్షిభాష, గోభాష, మృగభాష, సాముద్రికము, జ్యోతిషము, ప్రశ్నవిద్య యివన్నియు తెలియకనే, నేను సిద్ధాంతినైతినా?

మద:- అట్లయిన, నీప్రశ్నవిద్యను పరీక్షించెదను. నేను మనస్సులో నేమితలచియున్నానో చెప్పుము.

సాంబ:- (బూటకగణితమువేసి) యువరాజా! మీరు యిద్దఱుస్త్రీలను పొందవలెనని కోరియున్నారు. ఒక్కతె క్షత్రియకుమారి, మరియొకతె బ్రాహ్మణకుమారి.

మద:- నిజము. నాకోర్కె ఫలించునో లేదో చెప్పుము.

సాంబ:- మీకోర్కె తప్పకఫలించును.

మద:- ఆయిద్దఱుస్త్రీలెవ్వరు చెప్పుము.

సాంబ:- క్షత్రియకుమారి సత్యవతీదేవి.

మద:- అదినీకు తెలిసినదిగనుక చెప్పితివి. బ్రాహ్మణవనితయెవ్వరో చెప్పుము చూచెదను.

సాంబ:- మీరుఅమరము చదివినారా?

మద:- చిన్నతనమున చదివియుంటిని. మఱచినాడను.

సాంబ:- సరస్వతికి యెన్ని పేర్లున్నవో చెప్పుడు.

మద:- నాకుజ్ఞాపకము లేదు.

సాంబ:- అట్లయిన నేనేచెప్పెదను. 'బ్రాహ్మీతుభారతి' వసంతస్య భార్యాభారతి, ఈమయె విప్రవనిత. సరియేనా?

మద:- శబాస్! సిద్ధాంతీ! దైవజ్ఞుడవన నీవేకదా? సత్యవతివిషయమట్లుండనిమ్ము. ముందుగభారతిని నేనుపడయుటకు మార్గమేదియో చెప్పుము.

సాంబ:- మార్గమున్నది. అందుననించుక కష్టసాధ్యప్రయత్నమున్నది

మద:- సాధ్యమగునప్పుడు యెంతకష్టమైనను నేను లక్ష్యపెట్టను. అదియేమో చెప్పుము.

సాంబ:- అట్లయినవినుఁడు. స్త్రీవశ్యమునకుగాను, నామంత్రప్రభావముచేత, వశీకరణదేవతను ఆహ్వానముచేసి, ఆదేవతను కలశమందు స్థాపించవలెను. ఆదేవత "మాతంగి" యనబడుచండాలస్త్రీదేవతయై, బ్రాహ్మణులకు అస్పృశ్యురాలుగానుండుటచేత, ఆమెను బ్రాహ్మణస్త్రీపైన విడువవలెననిన, మొట్టమొదట, ఆదేవికి ప్రాయశ్చిత్తముచేసి, చండాలత్వముపోగొట్టి బ్రాహ్మణత్వము కలుగింపవలెను.

మదన:- ఇదియేమిసిద్ధాంతీ! చండాలులకు అస్పృశ్యతపోనేపోదని, రాజగురువులవారు దృఢముగాచెప్పుచున్నారే? నీమాటనేనెట్లు నమ్ముదును?

సాంబ:- యువరాజా! రాజగురువులసంకల్పమువేరు. నాసంకల్పము వేరు. నాశక్తినాకే, వారిశక్తివారికే. ఈయస్తగిరిసంస్థానమునందు చండాలుని బ్రాహ్మణునిగను, బ్రాహ్మణుని చండాలునిగను, చేయునట్టి ద్వ్యక్షరమంత్రసిద్ధిచెందినవాఁడను, నేనొక్కఁడనే అనివిధిలేక నేనుచెప్పుకొనుచున్నాను. ఇంతెందుకు? నామంత్రప్రభావంబున, ఆభారతితనకు తానేమీయొద్దకు పరుగిడివచ్చి, మీకౌగిలి కోరినప్పుడైన నామాటను మీరునమ్మెదరా?

మద:- కానిమ్ము. నీవుచేయుప్రయత్నమేదియో చెప్పుము.

సాంబ:- ఆమాతంగిని, బ్రాహ్మణినిచేసి, బంగరుకలశమందు స్థాపించి, యేడురాత్రిళ్ళును, యేడుపగళ్ళును పూజించి, యెనిమిదవనాడు బ్రాహ్మణసంతర్పణచేసి, ఆరాత్రే ఆదేవతను భారతిపైనికి విడిచెదను. తర్వాత భారతి యొకనిమిషమైనను మిమ్ములను విడిచియుండగలదా?

మద:-కానిమ్ము. నీకార్యమునకెంత ద్రవ్యముకాలయునో చెప్పుము

సాంబ:- కలశమునకు యేబదిపలముల బంగారు, పదునాలుగుపూజలకు పదునాలుగువేలు, సంతర్పణకు అయిదువేలు అంతయు చేరి యిరువదిసహస్రములు వరహాలైన, దేవతకు తృప్తి-తృప్తి

మద:- (చీటివ్రాయును) ఇదిగో సిద్ధాంతీ! యీచీటిని రాజకోశాధ్యక్షునికిచ్చి బంగారును ధనమును చేకొనుము. నీకార్యము నేడే ప్రారంభింపుము.

సాంబ:- (చీటితీసుకొని) భాగ్యము. (స్వ-మఱుగున) యీభ్రాంతుని, అస్తగిరి కీచకునిగ చేసితిని. కాని వీనిమృత్యువునుమాత్రము తప్పించవలసియున్నది. (అనిపోవును)

మద:- విశారదమంత్రి వేదగిరియందు లేడనునట్టివార్త, నాకు విజయవార్తగనున్నది. (సంతోషమున) విశారదుడు లేడు. వేదగిరి రాజపుత్రి సేనాధికారి వసుపాలుడు, నాకుయొళ్లై యున్నాడు. ఇంక వేదగిరి నారాజ్యమగుటకు సందేహమేమున్నది? ఓసీ! సత్యవతీ! నాసందేశము నీకు హాస్యమాయెనుకదా? మంచిది. నిన్ను నాదాసిగ చేసినప్పుడు నీవు పరిహాసింతువో లేక పరితపింతువో చూచెదను. ఇకనాలస్యముచేయక రేపే వేదగిరిపై దండువెడలెదను. ఓరీ సేవకా (అనిపిలచును.)

ప్రవేశము-సేవక.

సేవ:- ఏమిసెలవు?

మద:- ఓరీ! నాసేనాధ్యక్షుని, భద్రసేనుని యిప్పుడే నారహస్యమందిరమునకు తోడ్కొనిరమ్ము.

సేవ:- చిత్తము (అనిపోవును)

ప్రవేశము-చారుడు.

చార:- యువరాజా! భారతీమాయియొక్క దాసినియిప్పుడేకంటిని. రెండుదినములక్రిందట శారదాదేవియు, భారతీమాయియు, ఆదాసిని రహస్యముగ వెంటగొని, యెవరికిని తెలుపక సముద్రస్నానమునకనిపోయి, అందులోపడి ఆత్మహత్య చేసికొనిరని దాసిచెప్పి యేడ్చెను.

మద:- (కూలబడి చింతించి) ఓరీ నీవు పొమ్ము.

చార:- (పోవును)

మద:- వారిద్దఱును స్త్రీరత్నములు. పరమపతివ్రతలు. వారుపోయిరనుదుఃఖమును మఱవ నేనుయింకను దుష్కర్మలలో మునిగె

దను. యెట్లును నేను అస్పృశ్యుడను. శారద అస్పృశ్యురాలై నందున, భగవంతుని యెట్లుచేరగలదు? భగవంతుడేలేడు. లేడు లేడు దేవుడులేడు. నేనేమిచేసినను నన్ను శిక్షించువాడే లేడు. శారదామరణమునకు రాజగురువేకదా కారణభూతుడు. ఈహస్తము బ్రాహ్మణహత్యకు సిద్ధపడునా? ఇప్పుడాయోచన వలదు. వేదగిరిని జయించివచ్చి రాజగురువుపని తీర్చెదను.

(నిష్క్రమించును.)

——(o)——

అంకము 2–రంగము 3.

వేదగిరి-వీధిలో ప్రవేశము-మునిస్వామి (సేనాధ్యక్షుడై)

మునిస్వామి:- మారాజపుత్రిసేనకు అధికారియగు వసుపాలుడు, రాజద్రోహియై, మదనచంద్రునకు లోబడియుండుకారణమున, ఆవసుపాలుని సహాయమును నమ్మికొని, మదనచంద్రుడు సులభముగ, వేదగిరిని ఆక్రమించుటకై నిక్కుచు ఆకస్మికముగ దండెత్తివచ్చియున్నాడు; కాని, ప్రేమచంద్రయోగీంద్రుడును నేనును వానియొక్క వంచనావ్యవహారములన్నిటిని కనిపట్టుచు యేమఱకనుండువారమని మదనచంద్రునకు తెలియదు. మాల సైన్యమని పేరుగల నాసైన్యము మదనచంద్రునిసేనను తాకి, కకవికలుచేయను సిద్ధముగనుంచియేయున్నాడను. ఆవసుపాలుని యిచ్చటికి యిప్పుడేరమ్మని పిలుపించినాడను. వానినిభగ్న ప్రయత్నునినిగ చేసెదను. (చూచి) అదె వసుపాలుడేతెంచుచున్నాడు.

ప్రవేశము–వసుపాల.

వసు:- ముఖ్యసేనాధీశులకు నమస్కృతులు. ఏమిసెలవు?

ముని:- వసుపాలా! నీవు నీసైన్యముతోకూడ, ఉత్తరదిశకు నడతెంచి, అచ్చటనుండు కొండచాటున, నేనురెండవయుత్తరువు పంపువరకు నీవుండవలెను.

వసు:- అచ్చట నేనేమిచేయవలెను?

ముని:- శత్రువులు ఆదిక్కునుండి వచ్చిరేని, వారిని తాకిపోరవలెను?

వసు:- శత్రువులు ఆదిక్కునుండిరారే?

ముని:- అట్లనా? వారుయేదిక్కునుండి వచ్చెదరు.

వసు:- శత్రువులు పశ్చిమదిక్కునుండియే వచ్చెదరు.

ముని:- ఇదినీకెట్లు తెలియును?

వసు:- ఈమాట నేనువింటిని.

ముని:- ఎవ్వరుచెప్పిరి?

వసు:- ఎవ్వరోచెప్పిరి. జ్ఞాపకములేదు.

ముని:- ఎప్పుడుచెప్పిరి?

వసు:- అదియును జ్ఞాపకము లేదు.

ముని:- ఇట్టిమాటలు జ్ఞాపకముండవు, కాని నీవురాజద్రోహివి అను మాటయైనను నీకుజ్ఞాపకమున్నదా?

వసు:- ఏమంటిరి? నేను రాజద్రోహినా?

ముని:- నీవురాజద్రోహివి అగుదువో కావో, దీనినిచూచి నీవేచెప్పుము. (అనియొక పత్రికనిచ్చును) ఇదినీవు మదనచంద్రునకు వ్రాసిన లేఖకదా?

వసు:- (తటాలున లేఖచించివైచి) ఓరీ! చండాలా! నీవానన్ను దండించు అధికారివి? నాదేహమందు రాజపుత్రరక్తము యెట్లున్నదో తెలియునా? (అనికత్తినెత్తును)

ముని:- (కత్తినెత్తును) తెలుసును అదినల్లగై యున్నది.

పప్రవేశము-వసంత (శీఘ్రముగ పిస్తోలుతో)

వసంత:- ఆగుడు సేనాధ్యక్షు! ఓరీరాజద్రోహీ! ఇదెచూడుము నీ మృత్యుదేవత (అని పిస్తోలుచూపి గుఱిపెట్టి) పారవేయుము నీఖడ్గము. లేకున్న చచ్చితివి.

వసు:- (కత్తినిదించును)

ముని:- (వసుపాలునికత్తిని చేకొని) వసంతా! వీనిని, అదెవచ్చుచుండు మనభటులకు అప్పగించి, కాలుసేతులు బంధించి, చీకటిచెఱలో పడద్రోసి, వీడుబైలునకు రాకుండ, కాపుదలయుంచుము.

వసం:- భాగ్యము, (వసుపాలునికొనిపోవును)

ముని:- వసుపాలుడు పట్టువడెను. రాజభక్తుఁడగు జయచంద్రుని, అప్పుడే రాజపుత్రసేనకు అధికారిగనియమించి, భద్రోపఁబచినాడను. (లోపలనుండి వాద్యములధ్వని వినఁబడును)

ఓహో! యుద్ధముజరుగుచున్నది. నేను నావారికి తోడ్పడుటకై వెడలెదను (పోవును.)

(లోపలయుద్ధ కలకలము వినబడును తెరపైనికిబోవును.)

ప్రవేశము-మునిస్వామి భద్రసేన కత్తులతో పోరుచు

ముని-భద్ర:- పోరుదురు.

భద్రి:- (క్రిందపడును)

ముని:- (భద్రిసేనుని కాలితో తన్నిచూచి) అస్తగిరి సేనాధ్యక్షుడు భద్రసేనుడుకూలెను. మదనచంద్రు డెచ్చటనున్నాడో చూచెదను (అనిపోవును)

భద్రి:- (తలయెత్తి అటునిటుచూచి లేచును.) మదనచంద్రుని ప్రాణరక్షణకొఱకే, నేనుసోలినట్లునటించి క్రిందికిపడితిని. వీనిచేతికి మదనచంద్రుడు చిక్కకుండునట్లు నే నెట్లయినను కాపాడెదను (అని పోవును.)

(పునఃప్రవేశము-భద్రిసేనుడు మదనచంద్రునితో)

భద్రి:- యువరాజా! వేదగిరి సేనాధ్యక్షుడు మిమ్మును వెదకుచున్నాడు మీరు యీచోటునవిడచి అదె అచ్చటకానిపించుచుండు దట్టమగు పర్ణశాఖలుగల వృక్షమునెక్కి దాగియుండుడు. నేనెట్లయినను మనవారినిచేరి మీకు రథమును తెచ్చెదను. శీఘ్రమున పొండు (అని పోవును)

మదన:- (వృక్షము దగ్గఱకుపోయి) వృక్షమెక్కు నభ్యాసమే నాకు లేదు. దీనిమఱుగుననే యుండెదను. ఇదినిర్జనప్రదేశముగనున్నది

ఆహా! యెంత మోసమాయెను? వసుపాలునినమ్మి యొక వేటు నకు వేదగిరికోటను ఆక్రమించి, సత్యవతిని చెఱపట్టెదనని తల చితినే వసుపాలుఁడును లేఁడు, రాజపుత్రసైన్యమును లేదు. ఏది క్కునచూచినను చండాలసైనికులేయుండిరి. అందులో వీరుమా అస్తగిరివారయ్యేయున్నారు. చండాలులయందు ఇట్టియోధులు న్నారని, నాకు యీనాఁడే తెలియవచ్చెను. ప్రళయకాలకృతాం తుని దూతలుబోలె యీచండాలసైనికులుయొక్క పెట్టున నాసే నలనుతాకి, అచిరకాలంబుననే, చెల్లచెదరు కావించిరికద? రా జగురువు, చండాలులు, నిర్వీర్యులనియు, దుష్కర్ములనియు, అస్పృశ్యులనియుచెప్పచు, వీరుమాచెంతకు రాకుండునట్లును, మేమువారిని చెంది యుకుండునట్లును కట్టడిచేసెను. ఈబ్రాహ్మ ణుఁడు గురువనినమ్మినందునకు, మాసంస్థానమునకు గొప్పచేటు తెచ్చెను. వీరిని అస్పృశ్యులని తెగడినందునకుకదా, వీరుమా రాష్ట్రమునువదలి వేదగిరిరాణిని ఆశ్రయించిరి? ఈఅస్పృశ్యులు అస్తగిరికి అపజయమును, సిగ్గుపాటును తెచ్చినదేకాక, వేదగి రికి విజయమును కీర్తిని సంపాదించిరి. నాజనకుడు, తనగురువు కలియుగ ద్రోణాచార్యుడని నమ్మినందుకు, వీరులును రాజభ క్తులునుఅగునట్టి వేలకొలది మాలప్రజలు తనరాజ్యమునుండి వెడలిపోవునట్టి దుర్దశను తెచ్చుకొనెను! ఈగురువు, యీబాప డు, తలక్రొవ్వుతో నన్నే అస్పృశ్యునిగచేసినాడు కాని, యీ పగను తీర్చుకొనుటకైనను, నాప్రాణమును రక్షించుకొనెదను నాసారధిమడసె-రథముపోయె-ధనువుదునుమబడె. భద్రసేనుడు నన్నిచ్చటికి యెట్లొతెచ్చినాడు. (అనియిటునటుచూచి) ఇచ్చ టనొక్కరును లేరు.

సత్య:-(శీఘ్రముగ ప్రవేసించును-యుద్ధభటుని వేషమున)
ఎందుకులేరు-ఒక్కరున్నారు.

మద:- నీవెవ్వడవు?

సత్య:- నేను చండాలసిఫాయిని.

మద:- నీకు నమస్కరించెదను.

సత్య:- శత్రువునకు నమస్కరించు వాడవు నీవు యోధుడవా?

మద:- చండాలుడు నాకు శత్రుడుకాడు. చండాలుడు నాకు గురు సమానుడు.

సత్య:- ఇది యెన్నటినుండి?

మద:- నేటినుండియే.

సత్య:- అట్లనా? నీవుయుద్ధభూమినుండి యేలపరుగెత్తివచ్చితివి?

మద:- నేను పరుగెత్తి రాలేదు. నాశత్రువును తఱుముకొనివచ్చితిని.

సత్య:- (నవ్వుకొని) నీశత్రుడెవ్వడు?

మద:- ఉన్మత్తురాలగు సత్యవతియే నాశత్రువు.

సత్య:- వీరుడన్ననీవె. సత్యవతియొక్క పొగురును పోకార్చునట్టిశూరుని నేను వెదకుచునేయుంటిని. నీవుఅట్టివాడ వైనందుకు నాకు చాలసంతసమాయెను.

మద:- ఇట్టిసంతోషము నీకుండెనేని, ఆసత్యవతిని నాయెదుట వేయుము.

సత్య:- సత్యవతి నీయెదుటపడిన, నీవేమిచేయగలవు?

మద:- ఏమిచేయగలనా? ఆమెశిరమును యీకరవాలంబున రెండుబద్దలుగా నరికెదను.

సత్య:-అదెచూడుము సత్యవతి ఖడ్గపాణియైవచ్చెను. (అనిఆవైపున చూపును)

మద:-(తిరిగిచూచుచుండ)

సత్య:- (తటాలున వేషముమార్చి) ఓరీ మదనచంద్రా! (అని పిలచును.)

మద:- (తిరిగిచూచును)

సత్య:- ఇదె నీశత్రువును కనుగొంటివా? నిలువుము యుద్ధమునకు.

మద:- (అటునిటుచూచి, యెవ్వరునులేరని) తరుణీ! పులియింటికి మేకపిల్లవచ్చినట్లు నీవైకోరి నాచేతికిచిక్కితివి. ఇప్పుడు నీవునా శరణము కోరెదవా? లేక నీమరణమునుకోరెదవా? చెప్పుము.

సత్య:- నేను నీతో రణమునుకోరెదను. రమ్ము (అనికత్తితోపోడుచును.)

మదన-సత్య:- యుద్ధమాడెదరు.

మద:- (దెబ్బతగిలి సోలి క్రిందబడును.)

సత్య:- (మదనచంద్రుని యెదపైనకాలిడి) ఓరీ! ఉన్మాదుఁడా! నీవు పెండ్లికోరినందునకు నేను నాచేతులార, మృత్యుకన్యకను నీకు ను యిప్పుడె పెండ్లిచేసెదను. దైవధ్యానముచేయుము. (అని నరుకుటకు ఖడ్గము నెత్తును.)

వసంత.- (శీఘ్రముగవచ్చి) దేవీ! ఆగుము. ఇతనిని మీరువధింప కూడదు.

సత్య:- ఎందుకు? వీఁడునాకుశత్రుఁడుకాఁడా?

వసంత-ఇతఁడు మీకుశత్రుఁడైనను, మీ యొక్క మిత్రను మఱవ వచ్చునా?

సత్య:- ఆహా! ఏమఱితిని. నిక్కమున నేమఱితిని. (మదనునితో) మ దనచంద్రా? నీవువధకు అర్హుఁడవైయుండినను, విధిలేక నీప్రా ణమును తీయకవిడిచెదను. మూర్ఖా! లెమ్ము. బ్రతుకుము.

ప్రవేశము-మునిస్వామి-వసుపాలునితో (సంకిళ్ళు వేసి)

ముని:- దేవీ! ఈరాజద్రోహిని యేమిచేయవలెను?

సత్య:- సేనాధ్యక్షా! ఈరాజద్రోహి వసుపాలుడును, యీపత్ని ద్రోహి మదనచంద్రుఁడును కర్మచండాలులు అగుటచేత మన యొక్క పవిత్రములైన ఖడ్గములకు వీరు అస్పృశ్యులైయున్నా రు, కావున యీరెండుదుష్టపశువులను, కొనిపోయి మనపుర ము వెలుపట తోలిరమ్ము.

ముని:- చిత్తము. (అనిమదనచంద్రుని-వసుపాలుని తోడ్కొనిపో వును.)

ప్రవేశము-ప్రేమచంద్ర.

సత్య:- తండ్రీ! నమస్కృతులు.

వసంత:- గురుదేవా! వందనములు.

ప్రేమ:- కుమారీ! నీవుయింతటి పొరపాటుపడుదానవని నేను తలం పలేదు.

సత్య:- తండ్రీ! నాదేమిపొరపాటు?

ప్రేమ:- వసుపాలుని చెఱయందుంచక, మదనచంద్రుని వెంట పంపి నది మిగుల ప్రమాదకరమైన కార్యముకాదా?

సత్య:- తండ్రీ! వసుపాలుడేమి చేయగలఁడు?

ప్రేమ:- వసుపాలునికి, మనపురముయొక్కయు, అంతఃపురముయొక్కయు, రహస్యస్థలములును, కట్టడములన్నియు తెలియును. కాదె. మే నగాడగు మదనచంద్రునకు, సహాయముగ మనమే వసుపాలుని పంపినందున, దుర్యోధనునకు శకునిజతయైన విధము కాలేదా?

సత్య:- (యోచించి) తండ్రీ! నిక్కముగ నేను మిగులప్రమాదము నొనర్చితిని. ఇప్పుడెవసుపాలుని వెనుకకురప్పించెదను. వసంతా!

ప్రేమ:- వలదు.వలదు. సత్యవతి తనసత్యమును తప్పినడచునది చాలతప్పగును. ఒకసారి వసుపాలుని విడుదలచేసి, మఱల వానిని చెరపట్టునది. నీకుధర్మముకాదు. అయినదైనది, నేటినుండినేను వేదగిరియందె యుండెదను. అస్తగిరిలో నాకార్యము ముగిసిన ట్లాయెను.

సత్య:- తండ్రీ! నన్నంటివే? నీవును పొరవడితివికదా?

ప్రేమ:- అదియెట్లు కుమారీ!

సత్య:- మనశారదను మఱచితివే?

ప్రేమ:- నిజము-నిజము. నాపాపమును పరమాత్మ క్షమించుగాత! కుమారీ! నిన్నురక్షించునట్టి యోచనయందె మగ్నుడనై, అస్తగిరిరాజ్యమే, నశించుచుండు విషయమును మఱచితిని. ఆనాఁడు శారదాదేవి నాతోనుడివినవార్త నాహృదయమందు శూలము వలెగుచ్చుకొని, యెప్పుడెప్పుడు శారదాదేవి అస్పృశ్యురాలు కాదని నిరూపింతునోయని వేగిరపాటుచెందువాడను. మదనచంద్రుని సహితము దుష్కర్మవిముక్తునిచేయుదారి నరయువాఁడను. భోగిచంద్రునకు రాజగురువువ్రాసిన పత్రికయు, నేను వ్రాసినపత్రికయు రెండునుచేరియున్నవి. ఇంతలోననే భోగిచంద్రుఁడు అస్తగిరికివచ్చును. అతఁడే తెంచులోపల, అస్తగిరియందుండుమూర్ఖులగు సనాతులను సద్భావములకు త్రిప్పవలయును.

వసం:- గురుదేవా! సాంబమూర్తిని, సదాశివుని అప్పుడే నేను సరియైనమార్గమునకు తెచ్చియున్నాను. వారును వారిపక్షము వారనేకులును రాజగురువుయొక్క దుర్వాదమును, అంగీకరింపరని నాకు దృఢమైననమ్మకముకలదు.

ప్రేమ:- మేలాయెను. ఆస్థానపండితులే చాలముష్కరముపట్టియున్నారు. కానిమ్ము వసంతా! నీవును, మునిస్వామియు యిందే యేమఱకయుండుడు. మదనచంద్రుడు సత్యవతికుమారిచేత పరాజయమును, పరాభవమును చెందినందున, క్రోధముచేత, నేదైన నొకవంచనాకార్యమునకు ఉద్యుక్తుఁడుకాకమానఁడు.

సత్య:- తండ్రీ! మదనచంద్రుడింతటి దుష్టుడగుటకుకారణభూతుడు రాజగురువేయగును. అతడుకల్పించిన చండాలత్వము, అస్పృశ్యత వినిననాటినుండి, నాయొడలుమండుచున్నది. తండ్రీభోగిచంద్రుడువచ్చి యేమిచేయునో చెప్పగలవా?

ప్రేమ:- కుమారీ! ఇప్పుడేమిచెప్పుటకును సాధ్యముకాదు. అస్తగిరియొక్క క్షత్రియరాజ్యమును బ్రాహ్మణరాజ్యముగ మార్పవలెనని, రాజగురువు సాహసించి దురాలోచనమొనరించియున్నాఁడు. అందుకు చండాలులను వారిని పాతాళమునకు అడగదొక్కి, తనకుదాసుఁడగు భోగిచంద్రుని బొమ్మవలెనాడించవలెననియున్నాడు. క్షత్రియధర్మమునకును, విప్రునిఅధర్మమునకును యుద్ధముజరుగనున్నది. అర్జునునిబోలె, నేనుకృష్ణునినమ్మియున్నాను,

సత్య:- తండ్రీ! భోగిచంద్రుఁడు గురువుమాటవిని, శారద అస్పృశ్యురాలని, నిర్ధరించెనేని, ఆమెగతియేమికావలెను?

ప్రేమ:- కుమారీ! భీతిల్లకుము. శారదాకుమారికి ధైర్యముచెప్పుము భోగిచంద్రుడు అవివేకబలంబుచే అట్లునిర్ధరించెనేని, వేదగిరివలె అస్తగిరిసహితము స్త్రీరాజ్యమగుననినమ్ముము. నేనిప్పుడే అస్తగిరికిపయనమయ్యెదను. (పోవును.)

(తెరజారును.)

---

## అంకము 2-రంగము 4.

అస్తగిరి వీధిలో నలుగురు బ్రాహ్మణులు

### పాట-అనుబంధము 13

1 బ్రాహ్మ:-మనగురువులవారు గ్రామగ్రామములనుండి బ్రాహ్మణులనుపిలుపించి యింతగొప్ప సంతర్పణచేయుటకు యేమికారణముండును?

2 బ్రాహ్మ:- కారణము తెలిసియేయున్నది. యువరాజు అస్పృశ్యుడాయెను. భోగచంద్రుడు వృద్ధుఁడును బ్రాహ్మణదాసుఁడునాయెను. ఇకముందు అస్తగిలో బ్రాహ్మణప్రభుత్వము సిద్ధించునని గురువులవారికి సంతోషముకలిగియున్నది.

3 బ్రాహ్మ:- బ్రాహ్మణప్రభుత్వమాయెనేని, శత్రువులు దండెత్తి వచ్చినప్పుడు మనకు సైన్యమేది?

2 బ్రాహ్మ:- మనకు సైన్యమెందుకయ్యా? శత్రువును జయించుటకు మనయొక్క దివ్యమంత్రబీజాక్షరముల ప్రయోగమేచాలును.

3 బ్రాహ్మ:- ఈకాలముననట్టి దివ్యమంత్రసిద్ధి యెవరికిగలదు?

2 బ్రాహ్మ:- నాకుగలదు వినుము. రెండక్షరముల మంత్రము "పప్పు, మూడక్షరములమంత్రము పులుసు, చతురక్షరి పుళిఓర, పంచాక్షరి పరమాన్నము షడక్షరి మీగడపెరుగు" ఇన్ని సిద్ధముగానుంచుకొనినప్పుడు బ్రాహ్మణశత్రుఁడు నిలుచునా? పరుగెత్తిపోవును.

3 బ్రాహ్మ:- బ్రాహ్మణశత్రుడెవఁడయ్యా?

2 బ్రా:- బ్రాహ్మణశత్రుడు "ఆకలి"

1 బ్రా:- అయ్యా! నాకిప్పుడు కడుపుబ్బరము శత్రువైయున్నది. ఇక్కడ (కడుపుచూపి) నుంచి యిక్కడి (గొంతుచూపి) వఱకు తుపాకిలో మందుపోసి కూరినట్లున్నది. ఈశత్రువుపోవుటకేమంత్రమున్నదో చెప్పవయ్యా? లేకున్న నాప్రాణముపోవును (అని కూలబడును.)

2 బ్రా:-ఇది నడివీధికదయ్యా?

1 బ్రా:- ఇప్పుడు నాకువీధియైననేమి? సమాధియైననేమి?

2 బ్రా:- ఈయుబ్బరము అందఱికినున్నది. కావున మనమందఱము కూర్చుందము. మంచిమందుచూపించెదను.

అందఱు:- (కూర్చుందురు.)

2 బ్రా:- మనకు కాళ్ళబలము తగ్గిపోయినను నోటిబలముతగ్గలేదు కద? కనుక సంగీతము ప్రారంభించి, పాడి, ఆరోహణ, అవరోహణ, యుచ్ఛ్వాస, నిశ్వాసములు సాగించితిమేని, యీయుబ్బరము పలాయనమగును.

అందఱు:- అట్లనేకాని. ఏరాగము పాడుదము?

2 బ్రా:- రాగముయొక్క పేరుగీరు నన్నడుగవలదు. నానోటికివచ్చినరాగమును ప్రారంభించెదను. (అని కానడరాగము తీసి)

పాట-అనుబంధము 14.

(పాడుచుండ-ప్రవేశము-రాజభటుండు)

భట:- బ్రాహ్మణులారా! రాజవీధిలో నడచువారికష్టముగా, మీరు కాళ్ళుచేతులుదాచుకొని కూర్చునియున్నారా? బీదవాండ్లు కడుపులు కాలియేడ్చుచుండ, మీరు కడుపులుపగులునట్లుతిని, పాటలు పాడుచున్నారా? మీయుబ్బరము పాటలతోపోదు. లేచినావెంటరండు.

2 బ్రాహ్మ:- మేము లేవలేమయ్యా?

భట:- మీరులేచిరాకపోయిన, మీయబ్బలు యెవ్వరుఆపనిచేయవలెను.

2 బ్రా:- ఏపనిఅయ్యా అది?

భట:- గురువులవారుపెట్టిన కలశమును పల్లకిలో దేవాలయములోనికి మోసుకొనిపోవునట్టిపని.

1 బ్రా:- మేము బ్రాహ్మణులమే మాతోపల్లకిమోయించిన నీకు గొప్పపాపమువచ్చును.

భట:- బాపలారా! మీరుబూటకములతో మందిదుడ్డుతిని పొట్టలు పెంచుకొని, పట్టెనామములు పెట్టుకొని, కట్టలమీదకూర్చుని, నోటికివచ్చినట్లు, వీడుమాల, వీడుమాదిగ, వీడుచండాలుడు,

వీడు అస్పృశ్యుడని కూయునది పాపముకాదా? ఇం తెందుకు? మీపొట్టలను, చండాలుల పొట్టలనుకోయించిచూతము. అస్పృశ్యము యెవ్వరిపొట్టలలో నెక్కువగయున్నదో బైటపడును.

2 బ్రా:- నీకెంతపొగరురా?

భట:- ఊరకలేచివచ్చెదరా లేదా? (అనికొరడాయాడించును)

అందఱు:- వచ్చెదము-వచ్చెదము (అనిలేచెదరు)

భట:- ఈదారినడువుండు (అనితోడ్కొనిపోవును)

(లోపలభటుడు గద్దించును) పునఃప్రవేశము-భట.

భట:- బాపలారా! ఉస్-అబ్బ అనుచునడవరాదు. వేదఘోషతో నడవవలెను లేకున్న (అనికొరడాయాడించుచు) యిదిచూడుడు.

(ప్రవేశము-బ్రాహ్మణులుపల్లకి మోసుకొని)

అందఱు:- ఓం. ఓం. ఓం.

పల్లకిమోయుపాట-అనుబంధము 15

(పల్లకిని దేవాలయముదగ్గఱదించి)

1 బ్రాహ్మ:- అయ్యోరామ! యెట్టిసంకటము తెచ్చితివి?

3 బ్రా:-ఇదిగురువులవారి 'అస్పృశ్య' మంత్రప్రభావమయ్యా చేసిన తప్పునకువచ్చినది యనుభవింపనేవలయును.

4 బ్రా:- ఇకమీదయే బ్రాహ్మణుడేకాని, యెవ్వరినైన అస్పృశ్యుడని చెప్పినట్లయిన, అట్లనే వాని నోటిపైన పరకతో కొట్టెదను. ఈగురువాజ్ఞఅగ్గిలో కాలిపోని! వాడుమనకిచ్చినదుద్దు మండిపోని! యెవ్వడయ్యా యీకష్టముసహించువాడు?

2 బ్రా:- ఓయీ రాజభటా! ఆగురువునిచ్చటికిరమ్మనుము. సోదరులారా! ఈపల్లకియుతనిభుజములకు 'స్పృశ్యమా లేక అస్పృశ్యమా' అనిఅడిగెదను. స్పృశ్యమని చెప్పెనేని దీనిని మెసిచూడుము అనెదను. అస్పృశ్యమనిచెప్పెనేని, యీపాడెనుతీసుకొనిపోయి, ఆయేటిలో పారవేయుదము.

1 బ్రా:- ఇక్కడమనమెంతకూసినను యేమిప్రయోజనము? అంతయు అరణ్యరోదనమేయగును. దీనిని గుడిలోనికికొనిపోయి కాల్చివేయుదము రండు.

అందఱు:- (పల్లకిని గుడిలోనికితీసుకొనిపోవుదురు.)

పరివేషము- వ్యాసులు.

వ్యాస:- ఓయీ మహమ్మద్ సాబు యిటురమ్ము (అనిపిలచును)

పరివేషము-మహమ్మద్.

మహా:- సలాంసామీ! ఏమిహుకుం?

వ్యాస:- సాహేబ్! పూజారియింకనురాలేదు. నీవుత్వరగా లోనికి పోయి, గర్భగుడి తలుపులుమూసివచ్చి, బైటతలుపులుకూడ మూయుము.

**మహా:- గరూభగుడిదగ్గార్కి మేముపోవచ్చురాదంటారేసామి.**

వ్యాస:- ఎవ్వరంటారు సాహేబ్?

మహా:-కల్కారోజు నాదోస్తు మంగలతిమ్మన్న గరూభగుడిదగ్గార నిల్సివుంటే, వాన్కి నేను పిలిసేకిపోతిని. పూజారి ఖోపంచేసి, మీరు యిక్కాడ్కి రావచ్చుకూడాదు పోండికర్కె తర్మివేసాడు సామి.

వ్యాస:- పూజారికిబుద్ధిలేదు. అతఁడు మరల నిన్ను ఆక్షేపించినట్లయిన, మంగలివాఁడును, మహమ్మదీయుడును, అస్పృశ్యులుకారుఅని, నే చెప్పితినని చెప్పుము.

మహా:- "అసాపురుస్" అంటే యేంజాతిసామీ?

వ్యాస:- అదిమాంసముతిని, కల్లుతాగేజాతి సాహెబ్.

మహా:- మేముభీ-మంగలోల్లుభీ-కల్లుమాంసం. లగాయిస్తామే?

వ్యాస:-అదివేరేసంగతి నీకెంకుకు? అదిగో చూడు ఆభిక్షుకుఁడు యిక్కడికిరాకమునుపే నేనుచెప్పినపనిచేయుము. శీఘ్రముగపొమ్ము.

మహా:- అచ్ఛాసామి. (అనిముందుకునడచి)

మహా:- (స్వ) హిందూజనాల్కి మర్దానగీ, అనేదాన్ని దేవుడు యియ్యానేలేదు. అట్లాలేకుంటే ఒక్కహిందోడు దుసార్రి హిందోన్కి సూసి, నీవు "అసాపురుస్" అనిసెప్పితే, ఊర్కె సస్సినట్లు పడివుంటాడా? ఇదేమాట ముస్సల్మాన్కు సెప్పితే తడాఖాసూసిస్తాడు. నోటిపండ్లు ఊడకొడ్తాడు.

(అనిపోయి తలుపులుమూయును)

ప్రివేశము-ప్రేమచంద్రి, వసంత.

ప్రేమ:- స్వామీ! దేవాలయముయొక్క తలుపులనెందుకు మూయించితిరి?

వ్యాస:- అదిరాజగురువులవారి యాజ్ఞ.

ప్రేమ:- రాజగురువులేమని యాజ్ఞనిచ్చినారు?

వ్యాస:- అస్పృశ్యునిదేవాలయములోనికి విడువరాదనియాజ్ఞచేసినారు.

ప్రేమ:- అస్పృశ్యుడెవ్వడు?

వ్యాస:- నీవు.

ప్రేమ:- ఈనిర్ణయముచేసిన పండితుడెవ్వడు?

వ్యాస:- నేనె. ఆస్థానద్వితీయపండితుఁడగు యీవ్యాసుఁడే యీనిర్ణయముచేసియున్నాఁడు.

ప్రేమ:- స్వామి! నాయపచారమును క్షమింపుఁడు. మీరుఆస్థానపండితులని నాకు తెలియలేదు? వ్యాసులవారు! నానమస్కారమును స్వీకరింపుఁడు.

వ్యాస:- అస్పృశ్యుని నమస్కారమునకు నాతిరస్కారముండని.

వసంత:- సోమయాజులుగారు! మీరువ్యాసులేకాని, దుర్వాసులు కారే? కోపముమాని శాంతముగ భాషింపుఁడు.

వ్యాస:- వసంతా! ఇంకనునీవీయస్పృశ్యుని సహవాసము వదలలేదా? మొన్ననీకు చిలుకకుచెప్పినట్లు నేనుబోధించినదంతయు వ్యర్థముచేసితివా? నీదుర్బుద్ధిని విడువవైతివికదా? కానినీవుప్రాయశ్చిత్తముచేసుకొనువఱకు, నేను నీముఖమునుచూడను. పొమ్మివతలకు.

వసం:- స్వామీ! ఆనాఁడు మీరునాతో శాంతముగమాట్లాడినట్లు యిప్పుడీ యోగీంద్రునితోభాషించి, వీరినియొప్పించితిరేని, మేమిద్దఱమును ప్రాయశ్చిత్తముచేసికొందుము.

వ్యాస:- ఇది మంచిమాట. అస్తగిరికిక్షేమకాలమువచ్చునట్లున్నది. అయ్యా! ప్రేమచందాీ! నీవస్పృశ్యుడవు కావున యీదేవాలములోనికి పోకూడదు.

ప్రేమ:- స్వామీ! మీమాటయట్లుండ, నేనుభగవంతునకుసహితము అస్పృశ్యుఁడనేనా?

వ్యాస:- అవును.

ప్రేమ:- ఇది మీరుచెప్పినదా? లేక భగవంతుడు చెప్పినదా?

వ్యాస:- నేనేభగవంతుఁడను.

ప్రేమ:- అదెట్లు?

వ్యాస:- "జ్ఞానతపసాపూతామద్భావమాగతాః" "జ్ఞానీతుఆత్మైవ" అనునట్టి భగవద్గీతావాక్యములననుసరించి, నేనుజ్ఞానినికావున భగవంతుని స్వరూపమునుపొంది, యీమాటను చెప్పెదను.

ప్రేమ:- అదేభగవద్గీతయందు, లోకసంగ్రహకార్యములను చేయవలసినభారము జ్ఞానియగువానిపైన నున్నదని, కృష్ణభగవానుఁడు చెప్పియుండలేదా?

వ్యాస:- చెప్పినాడు. ఇప్పుడావిషయమెందుకు?

ప్రేమ:- మీరుజ్ఞానులే! పండితులే! యీయస్తగిరియందు చండాలులని పిలువబడువారు దుష్కర్మదురాచార ప్రవర్తకులైయుండిరేని, యూరకవారినిచూచుచు, దూషించుచు, అసహ్యపడుచు, వారిని యుద్ధరింపకుండునది మీకుధర్మమగునా?

వ్యాస:- నేనేమిచేయుటకు సాధ్యమగును?

ప్రేమ:- శ్రీకృష్ణభగవానుని వాక్యమునుగౌరవించి ప్రవర్తించుటకు మీకుసాధ్యమగును.

వ్యాస:- అదియేవాక్యమో చెప్పుము.

ప్రేమ:- "విద్యావినయసంపన్నే బ్రాహ్మణే, గవిహస్తినిశునిచైవ, శ్వపాకేచ, పండితాస్సమదర్శినః' అనువాక్యమున్నది. శ్వపాకుడనబడు చండాలునికూడ మీరు సమదృష్టితోచూడవలెనని భగవానుని ఆజ్ఞకలదుకదా? ఈయాజ్ఞను మీరు జరిపెదరా? లేక యుల్లంఘించెదరా? చెప్పుడు.

వ్యాస:- (యోచనతో యూరకుండును.)

ప్రేమ:- స్వామీ! నేను చండాలుఁడనియే మీరుతలంచినను, భక్తితో, దైవభజనకుపోవుచున్నాను, ఇట్టిచో "యేభజంతితు మాంభక్త్యా, మయితే, తేషుచాప్యహం" అనునట్టి భగవద్వాక్యమును మీరు వ్యర్థముచేయుచు, నాకభ్యంతరము చేయవచ్చునా?

ప్రవేశము శీఘ్రముగ-సాంబ, సదాశివ.

సాంబ-సదా:- అభ్యంతరముచేయరాదు. చేయరాదు. వ్యాసులవారు! తలుపులతీయింపుడు.

వ్యాస:- సోదరులారా! తలుపులుతీయించుటకు స్వయముగా నాయభ్యంతరమేమియులేదు, కాని గురువాజ్ఞకు నాస్వతంత్రమేమున్నది?

సాంబ:- అదిదుష్ట గురువాజ్ఞ. సద్గురువాజ్ఞకాదు. మీరుతలుపులు తీయించనేవలయును. లేకున్న మేము విఱుగకొట్టెదము (అనియత్నింతురు.)

వ్యాస:- తాళుఁడు-తాళుఁడు. యోగీంద్రా! మీరుయింతటిజ్ఞానులైయుండియు దేవాలయములోని రాతివిగ్రహమునే పూజింపను పట్టుపట్టియున్నారే. మీరుదేవుని చూచునది, ఆవిగ్రహమందేనా?

ప్రేమ:- పండితోత్తమా! మీరుపొరవడినారు. నాభావము, అదికాదు. మూఢజనులకు దైవభక్తి కలుగించుటకై నేను అజ్ఞానియొనరించునట్టి కార్యమునుచేయుచున్నాను. "యోమాంపశ్యతిసర్వత్ర, సర్వంచమయిపశ్యతి, తస్యాహంనప్రణశ్యామి, అనునట్టిదే నాభావము. (వసంతునితో) వసంతా! శ్రీకృష్ణభగవానుని, యీవ్యాసులయందే నేనుచూచుచున్నాఁడను. వీరికేనారికేళముసమర్పించి హారతివెలుగింపుము.

వసం:- (టెంకాయకొట్టును.)

వ్యాస:- (తటాలునలేచి గుడితలుపులు తెఱచును.)

ప్రవేశము-మాలలగుంపు-శుచులై

అందఱు:- (గుడిలోనికి పోవుదురు.)

ప్రేమ:- (కృష్ణస్తుతిచేయును.)

పాట-అనుబంధము 16

వ్యాస:- (ప్రేమచంద్రునకు (మ్రొక్కును.)

మంగళహారతితో తెరజారును.

---

## అంకము 3-రంగము 1

వేదగిరి అంతఃపురము.

సత్యవతి-శారద-భారతి-భజనచేయుచుందురు.

అందఱు:-పాట-అనుబంధము 17

(పూజించి పుష్పములు చల్లి)

శారద:- కృష్ణా! నీరజాక్షా! నన్నునిర్దోషరాలుగ నిరూపించి, నా నాథునిసత్కర్మనిరతునిగనొనర్చి, నన్నుధర్మపత్నిగస్వీకరించునట్టి బుద్ధి యతనికొసంగి నన్నురక్షింపుము.

భారతి:- వాసుదేవా! నానాథునకు నెట్టియాపదయు సంభవింపకుండ కాపాడి, నామంగళసూత్రమును సంరక్షింపుము.

సత్యవతి:- నిరంజనా! నిత్యానందా! నాహృదయమందెట్టి కామమును చొరనివ్వక నాబ్రహ్మచర్యను రక్షింపుము,

శార:- సోదరీ! ఇట్లేల వింతరీతిగా, దైవమును ప్రార్థించితివి? నీకు వివాహమువలదా?

సత్య:- వలదు-వలదు. నిక్కముగా నాకువివాహమువలదు.

శార:- సోదరీ! ఇంతగొప్పరాజ్యముయొక్క పరిపాలనము జరుగవలెనే? నీకుభర్త లేకయుండిననెట్లు?

సత్య:- జగద్భర్తయగు ఆనందాత్ముని నాహృదయ మందిరమందు స్థిరముగా నివసింపజేసియుండ, వేరొకదేహధారిని నాకుభర్తగానుండుటకు నేనభిలషింతునా? విశ్వరక్షకుఁడగు పరమాత్మ, యీపనికిరానిరాష్ట్రమును రక్షింపలేఁడా? ఈరాజ్యము నాదియగునా? దీనిరక్షణకు నేనుకర్తనగుదునా? అశాశ్వతంబగు దేహానందమును నేను కోరుదునా?

గీ॥ కలిగెనేమంటిదేహంబు-కర్మగతిగ
ఏవిధంబుగతనువిది-పోవునంచు
పగలురేయినిపెల్లుగా-వగచుచుందు
పెండ్లియనుమాట వినవాకు-ప్రీతిలేదు॥

భారతి:- దేవీ! వివాహముచేసికొనిన తప్పగునా?

సత్య:- మాయీ! వివాహములు విధింపబడినట్టి యుద్దేశంబును తెలుసుకొని వివాహములుసలిపిన నేమియుతప్పులేదుకాని వినోదవిలాసంబుల నపేక్షించి, దేహానందమునుకోరి, వృక్షములమీఁదిపక్షులఁబోలె, దొడ్లలోని పశువులుబోలె, అడవులలోని మృగములబోలె, కూడి క్రీడించునట్టి విహారక్రియయే వివాహమని తలఁచి, పెండ్లిసలుపునది తప్పేయగును. ఇట్టివివాహము సత్సంతానమునకు ముప్పగను, గృహస్థాశ్రమమునకు ఐపుగను పరిణమించును. మాయీ! శారదా! రాత్రిచాలప్రొద్దయినది. మీరులోనికిబోయి నిద్రింపుఁడు.

భారతి--శార:- (లోనికి పోవుదురు.)

తెరజారగా ప్రవేశము-మదనచంద్ర (బైరాగివేషమున)
భద్రసేన (మారువేషమున)

మదన:- భద్రసేనా! వసుపాలుఁడు రాక్షసమాయబోలె, యొక్కరికిని తెలియకుండ మమ్ముల నీశయ్యాగృహమునకుకొనివచ్చి విడిచిపోయెనే? మనము ముందేమిచేయవలసినది, నీవు తెలుసుకొంటివా?

భద్ర:- యువరాజా! నేనంతయు దెలుసుకొనియున్నాఁడను. లోపల సత్యవతీదేవి నిద్రించుచున్నది. ఈగోడయందున్న కీలుబొమ్మను త్రిప్పితిరేని, సందు తెఱచుకొనును. మీరులోనికిబోయి సందునట్లనేమూసి యీతలుపుతిన్నగ తెఱచి వెలుపటికిరండు. పిమ్మట చేయవలసినది నేనుచెప్పెదను.

మదన:-(అట్లనేచేసి వచ్చును.)

భద్ర:- (తలుపులుమూసి) యువరాజా! మీరామఱుగునదాగియుండుడు. నేనుపోయి వసుపాలునిగాంచి, యీమేడయొక్క క్రిం

దిభాగమున రథమును, భటులను సిద్ధముగనుంచి నేనుకావలి యుండెదను. మీరులోనికిబోయి సత్యవతీదేవితో భాషింపుఁడు. నేను లోనికిరావలసిన యవసరముకలిగినేని తిన్నగయాలవే యుఁడు. నేనువచ్చెదను.

మద:- అట్లనేకానిమ్ము. నీవుత్వరగసిద్ధమైయుండుము.

భద్రి:- ఒకక్షణమున సిద్ధుడనయ్యెదను (అనిపోవును.)

మద:- (ప్రక్కకుబోవును)

(మరియొకప్రక్కనుండి ప్రవేశము-మునిస్వామి-వసంత (నిశ్శబ్దముగ)

ముని-వసం:- (ఇద్దఱును మూగిసైగలు చేసుకొనుచు భద్రిసేనుని వెన్నంటిపోవుదురు.)

మద:- (లోనికిపోవ-తెరపైనికెగయును.)

మాయీ! భిక్షాందేహీ! (అనును)

సత్యవతి:- (నిద్రనుండిమేల్కని) (స్వ) ఎవ్వరోపిలిచినట్లాయెను. (ప్ర) ఎవ్వరది (అని ప్రశ్నించును.)

మద:- మాయీ! భిక్షాందేహీ!

సత్య:- (స్వ) ఏమిది? యెన్నడులేనిభంగి, యీనిశీధివేళయందు భిక్షుకుఁడు పలుకుచున్నాఁడు (అనిలేచివచ్చి) ఎవ్వరయ్యానీవు? ఇచ్చటికి నీవెట్లువచ్చితివి? తలుపునెవ్వరు తెరచిరి?

మద:- మాయీ! మంత్రజ్ఞులగు యోగులు, పరులకుమేలుచేయ కోరిరేని, వారుతలఁచినచోటునకు నెట్టియభ్యంతరమునులేకుం డపోగలరని నీకుతెలియదా?

సత్య:- మీరెవ్వరు?

మద:- యోగులను మీరెవ్వరని యడుగునది నిషిద్ధము.

సత్య:- వనితల శయ్యాగృహములకు యోగులుపోవుట నిషిద్ధము కాదా?

మద:- అత్యంతవసరకార్యమునకు నిషిద్ధమేమియులేదు.

సత్య:- అంతటియవసరకార్యమేమున్నది?

మద:- మదనచంద్రుఁడు నీతోపరాజితుఁడై యస్తగిరికిపోలేదు.

సత్య:- ఈమాటచెప్పునదియా యవసరకార్యము?

మద:- శాంతముగవినుము. మదనచంద్రుడు నీకుదాసుడై యుండు టకపేక్షించియున్నాడు.

సత్యా:- ఈమాటకుమాత్ర మవసరమేమున్నది?

మద:- మదనచంద్రుడు తానేయిచ్చటికి వచ్చియున్నాడు.

సత్యా:- (మదనచంద్రుని పరిక్షించిచూచి) ఓరీ! నీవు యోగివికావు వంచకుడవు.

మద:- దేవీ! నేను యోగినికాకున్నను నీచరణదాసుడనగుదును. (అనిచరణములంటబోవును.)

సత్యా:- (కాలితోతన్ని) ఛీ! దురాత్మా! నన్నుతాకకుము.

మద:- దేవీ! మృదువైన పద్మమువంటి నీపాదము, కఠినంబగు నా శిరమునకుసోకి యెంతనొచ్చియున్నదోకద? నాకన్నులనొత్తి నీ పదముల నొప్పి నార్పెదను.

సత్యా:- దుష్టుడా! నీశిరము ను నాకాలితోతన్నినదిచాలదు. ఇదినా. ఆయుధశాలయైయుండెనేని, నాకరవాలముతో నీకంఠమును ఖండించుచుంటిని.

మదన:- ఉత్ప|| ఎట్టితపంబుచేసితినొ? యెంతటివేల్పునుగొల్చియుంటినో?
ఎట్టిపునీతులన్ గదిసి, యిమ్ముగసేవలొనర్చినానొ? నీ
యట్టిసువర్ణగాత్రి మృదులాబ్జపదంబులు నాశిరంబుతో
ముట్టెడుపుణ్యమబ్బెగద? ముద్దులచాన! సుధాకరాననా!

శరీరప్రాణమాన ధనంబులను నీకుసమర్పింపను వచ్చియున్న, యీ మదనచంద్రుడు తనశిరమును నీకునర్పించుటకు వెనుదీయునా? (అని నిజరూపముచూపును.)

సత్యా:- ఆహా! నీచాత్మా! నిన్నుప్రాణముతో విడిచినందుకు, నెంత టిమోసమును యెంతటిదుష్కర్మను చేసితివి?

మదన:- నీవునన్నేల వధింపకవదలితివి?

సత్యా:- నీవుబ్రతికినను చచ్చినవాడవేయని, నిన్నువధింపనైతిని.

మద:- ఇదికల్ల. నీవు నన్ను మోహించినందుననే, వధింపలేదనినాకు తెలుసును.

సత్యా:- కలుషాత్మా! ఇట్టి నీచోక్తులను నుడువుటకు నీకుసిగ్గులేదా?

మద:- వలచినదానియొద్ద నాకుసిగ్గెందుకు?

సత్య:- ఇకమారుపలుకక యిచ్చటినుండి వెడలిపొమ్ము.

మద:- నీవును నావెంటవచ్చిన పోయెదను.

సత్య:- ఊరకపోయెదవా లేదా?

మద:- నేనొక్కడనేపోను పోజాలను. నిన్ను నావెంటగొనిపోయెదను.

సత్య:- నన్నుకొనిపోవునట్టిశక్తి నీకు లేదుసుమా!

మద:- పంకజాక్షీ! నీబింకములింకపనికి రావు. చక్కగ యోచింపుము ఇచ్చట నీయఱపు నాలకించువారు లేరు. నీవు నిరాయుధవు. అబలవు. ఆయుధపాణినగు నన్నునిరోధింపజాలవుసుమా.

సత్య:- మానవాధమా! నీయాయుధము నన్నేమియు చేయజాలదు. సత్యధర్మములకు కట్టుపడిన స్త్రీయొక్కతి తీక్ష్ణాధైర్యబలంబెట్టిదనుకొంటివి?

సీ॥ సరగత్రిమూర్తులఁ జంటిపిల్లలజేసి-యుయ్యెలనూచిన యువిదబలము
బోయఁడొక్కఁడు దుష్టబుద్ధియైచరియింప-భస్మంబుచేసిన వనితబలము
యమలోకమునకేగి శమనుని మెప్పించి-పతిజీవమును దెచ్చు సతివబలము
గాధినందనువంటి ఘనుడైనఋషిచంద్రు-పంతంబుపోలించు పడఁతిబలము॥

గీ॥ పోల్ప, వ్యర్థమగునునీదు-భుజబలంబు
ధనువుఖడ్గముల్ బట్టుట-దైత్యబలము
సతులవాక్యమందెచెలంగు-సత్యబలము
సరగనినువంటిదుష్టులఁ-జంపుబలము॥

మద:- తరుణీ! నీవువ్యర్థముగా నాతో వాదింపకుము. నీవునావెంట వచ్చువఱకు నేనువదలువాడనుకాను. వలచినదానిని యాకరవాలంబున వధింపలేను కనుక నీవుసమ్మతింపకున్న నిర్బంధముగ నిన్నుకొనిపోవగలను,

పాట-ఇద్దఱిది అనుబంధము 18

సత్య:- ఓరీనీచా! నీకుచేటుకాలము సమీపించియున్నదని నమ్ముము

మద:- పొలఁతీ! నీపొగరుమాటలఫలము నిప్పుడేయనుభవింపగలవు (అని యాలవేయును)

ప్రవేశము-భద్రసేన (చేతులువీపునకుకట్టబడియుండ తలవంచు
కొని వచ్చును.)

మద.- భద్రసేనా! ఇదియేమిట్లున్నాఁడవు?

భద్ర.- యువరాజా! ఎవ్వఁడోవచ్చి తటాలున నాకండ్లుమూసి నా
చేతులను వీపునకు కట్టినాఁడు (అనివీపుచూపును.)

మద.- నీభటులేమైరి?

భద్ర.- భటులనందఱిని చెఱసాలకుబంపినాఁడు.

మద.-ఇంతపనిచేసిన వాఁడెవఁడు?

ప్రవేశము-ప్రేమచంద్ర.

ప్రేమ.- నేను.

మద.-(గడగడవడకి కత్తికిఁద వేసి) ప్రేమ-యోగి-యింద్ర-చంద్ర
(అనితొట్రుపాటు మాటలాడి) యోగీంద్రా! నేనుమహాపరా
ధిని. నన్ను శిక్షింపుము. చంపుము. కాల్చివేయుము.

ప్రేమ.- పవిత్రమగు క్షత్రియకులమందుజనించి, నీచమతివై యిట్టి
సిగ్గుమాలినకృత్యమును చేతువా?

మద.-మహాత్మా! నాసిగ్గంతయు యీసత్యవతిచేతమాసిపోయినది.

ప్రేమ.- మూర్ఖమతీ! సత్యవతీయనెదవా? సత్యవతీదేవియని యామె
చరణములకు మ్రొక్కుము.

మద.- సత్యవతీదేవీ! నాయపరాధమును క్షమింపుము (అనిమ్రొ
క్కును.)

ప్రేమ.- మదనచంద్రా! నీకుట్రలు-నీదుష్క్రియలన్నియునాకు తె
లియును. నీయపరాధములు కడుఘోరములై యున్నవి.

మద.- మహాత్మా! నేనుమహాపరాధినని, మొదటనేయొప్పుకొంటిని
కావున మీరు విధించుశిక్షను నిరీక్షించుచున్నాఁడను.

ప్రేమ.- నీకెట్టిశిక్షవిధింపవలెనో నీవేచెప్పుము.

మద.- మరణశిక్షయే నాకు తగినదండనము. నన్నురిదీయుఁడు. కరు
ణింపకుఁడు.

ప్రేమ.- అట్లనేచేయవచ్చునుకాని, శారదాకుమారికి వైధవ్యము
కలుగునని యోచించెదను.

మద:- శారద-నాశారద-యెన్నడో పరమపదముచేరినది. యో
చింపకుడు.

ప్రేమ:- లేదు. శారదాకుమారి బ్రతికియేయున్నది. నీవామెను వె
దకించుచుండినందున నట్టివార్త సృష్టింపబడెను.

మద:- అయిన భారతీమ్మాయికూడ బ్రతికియున్నదా?

ప్రేమ:- బ్రతికియున్నది.

మద:- (కన్నీరురాల్చి) యోగిచంద్రా! ఒకసారి నాశారదను, భా
రతీమాయిని, నేనుదర్శించునట్లొనర్చి పిదప నన్ను ఆజన్మఖైది
గ చెఱసాలయందుంచుడు. ఇది నాప్రార్థన.

ప్రేమ:- ఆనారీరత్నములను నీవుచూచి యేమిచేయనున్నాడవు?

మద:- వారిపాదములమీదపడి, క్షమింపవేడికొందును. పిమ్మట,
మీవేదగిరియందె నేనుచచ్చువఱకు చీకటింట నివసించెదను.
ఇదియె నాకుప్రాయశ్చిత్తము.

ప్రేమ:- మదనచంద్రా! నీకునిజముగ నింతటి పశ్చాత్తాపముకలిగి
నదా?

మద:- మీపాదములానకలిగినది. వలయునేని నాహృదయమును
భేదించి, మీకన్నులారతిలకింపుడు.

ప్రేమ:- భారతీమాయీ! శారదకుమారీ! మీరిట్లు విచ్చేయుడు.

ప్రవేశము-శారద-భారతి,

శారద:- (మదనచంద్రునకు నమస్కరించి దుఃఖించును.)

మదన:- (భారతికి-శారదకు మ్రొక్కి) భారతీమాయీ! ఈక్రూర
కర్ముని యీకిల్బిషమానవ్యుని క్షమించి రక్షింపుము. (శార
దతో) కాంతామణీ! సావిత్రి-దమయంతీ పతివ్రతల చరితము
లను వినియుంటిని. నేడు నీచరితమును కన్నులతోకంటిని దేవీ!
నాయవివేకమును నానేరములనుమన్నించి నన్నుకాపాడుము.
(ప్రేమచంద్రునితో) మహాత్మా! ఇకనన్ను చెఱసాలకుపంపుడు.
నేనుపోవుటకు ముందు మీరునాకొకవరము నివ్వుడు.

ప్రేమ:- అదియేమివరము?

మద:- మారాజగురువు యీశారద అస్పృశ్యురాలని.

ప్రేమ:- మదనచంద్రా! నాకంతయు తెలుసును. నీవుకోరనున్న వరమును తెలిసెను. ఆనాడే నీజనకునకు శారదాకుమారి విషయమున నొకపత్రికను వ్రాసిపంపితిని. భోగిచంద్రుడు నాపత్రికను గారవించి, రాబోవుపున్నమనాడు అస్తగిరిలో అస్పృశ్యవిచారణ సభజరుగునట్లు నియమించియున్నాడు. నేనాసభకుపోయి శారదాకుమారి అస్పృశ్యురాలుకాదని నిరూపించెదను. పున్నమవరకు, నీవునీభార్యతో వేదగిరియందెయుండుము. (భారతితో) భారతీమాయీ! నీపతి వసంతసోదరుడును, మునిస్వామియును, మదనచంద్రుని భటులను వసుపాలుని చెఱయందుంచి కావలియున్నారు. వసుపాలుని జన్మక్షైదీగనుంచెదను. అస్తగిరి భటులను విడుదలచేసెదను. (భద్రసేనునితో) భద్రసేనా! నిన్ను బంధవిముక్తునిచేసెదను (అనికట్లువిప్పి) నీవునీభటులతో అస్తగిరికిపొమ్ము. పున్నమదాటువఱకు నిచ్చటజరిగిన విషయమొక్కటియు బైలుపఱచకుము. ఎవ్వరేమియడిగినను చెప్పకుము పొమ్ము.

భద్ర:- యోగీంద్రా! మీయాజ్ఞను నెఱవేర్చెదను (అనిపోవును.)

(తెరజారును)

—— (o) ——

## అంకము 3-రంగము 2

## ప్రవేశము-సాంబమూర్తి.

సాంబ:- పాట (అనుబంధము 19)

నాభార్య యొంటినిండ ఆభరణములు, నాపెట్టెనిండ వరహాలు సంపాదించితిని. ఇకముందు సంపాదనశక్తి నాకులేనందున, 'వృద్ధనారీ పతివ్రత' యనినట్లు ప్రేమధ్యానమున కారంభించినాడను. ఇందులో దొంగలభయము. రాత్రిజాగారము, పగలునిద్ర ఈతీరున నావ్యవహారమే తలక్రిందైనది. ఈభయముతప్పుటకు నాకొక్కటి తోచుచున్నదికాని సదాశివుడువచ్చిన యోచించెదను.

ప్రవేశము-సదాశివ.

సదా:- సాంబ! అదియేమి యోచనరా?

సాంబ:- తలచినంతనే వచ్చితివా? నేనుమాటలదయ్యాము. నీవు మాటలదయ్యాము. నేనుతలచిన నీవుప్రత్యక్షము, నీవుతలచిన నేనుప్రత్యక్షము.

సదా:- అదియుండని. నీయోచనయేదియోచెప్పుము.

సాంబ:- ఇకమీద యస్తగిరిలో రాత్రియనునదేయుండరాదు. ఎప్పటికిని పగలేయుండునట్లుచేయవలెను. ఇదియే నాయోచన చూడుము.

సదా:- ఇదిసాధ్యముకాదు.

సాంబ:- నీకు-నాకు సాధ్యముకాదుకాని, రాజగురువునకిది సాధ్యమగును. గౌరవవంశపురాజపుత్రికను అస్పృశ్యురాలుగ నిర్ధరించి, యువరాజును రాజ్యభ్రష్టునిగచేయనున్న ధీరుడు సూర్యచంద్రులకు ఆజ్ఞాపత్రికలువ్రాసి, అస్తగిరిలోయెప్పుడును పగలేయుండునట్లు చేయలేడా? నీవుపోయియడుగుము.

సదా:- సాంబా! ఇదికష్టమగు వ్యవహారము. నేనొకసులభక్రియను నీకుచెప్పెదను. దానినినీవుచేసితివేని, రాత్రియనునదే నీవుచూడవు.

సాంబ:- ఆసులభక్రియయేది?

సదా:- ఒకవరహాయిచ్చి, ఆకాశగమన విమానమునుకొనుము. ఇక్కడరాత్రి ప్రారంభమగుచునుండగనే, నీవునీభార్యతో వరహాలు, సొమ్ములు మూటకట్టుకొని ఆవిమానమునెక్కి అమెరికాదేశమునకు యెగిరిపొమ్ము. అప్పుడక్కడ పగలేయుండును. అక్కడరాత్రియగుచుండగనే, అట్లనేవిమానమెక్కి యిక్కడకి దుముకుము. అప్పుడిక్కడపగలుండును. ఇంక నీకురాత్రియెక్కడిది?

సాంబ:- సరే. వరహాకొక్క విమానము విక్రయించునప్పుడు నేనీపని తప్పకచేసెదనులెమ్ము.

ప్రవేశము—మఠము పారుపత్తెగాడు.

పారుపత్తె:- సిద్ధాంతులుగారూ! నమస్కారము. (సదాశివునిచూచి) ఓహో! దీక్షితులుగారు! ఇద్దఱునిక్కడనేయున్నారే. నమస్కారము.

సాంబ:- నమస్కారము. పారుపత్తెగారు! ఏమివిశేషము? శ్రీగురువులవారు సౌఖ్యముగనున్నారా?

పారు:- గురువులవారికి సుఖముకలిగించుటకును, దుఃఖముకలిగించుటకును మీచేతియందున్నది.

సాంబ:- మాచేతులందేమున్నది? ఆజ్ఞాపత్రికలువ్రాయునట్టి యధికారరేఖలే లేవే. ఇదెచూడుడు (అని అరచెయ్యిచూపి) నాచేతిలో వట్టిగీతలున్నవి. సదాశివా! నీచేతులు వీరికిచూపుము.

పారు:- సిద్ధాంతిగారు-హాస్యమెందుకు? నేనువచ్చినపనిని మీరుఫలితముచేయవలెను.

సాంబ:- అదేమియో యానతిండు.

పారు:- రేపురాజసభలో అస్పృశ్యతాఖండనవాదమునందు, మీయభిప్రాయము లెవ్వరిపక్షముగ నిచ్చెదరో చెప్పుడు.

సాంబ:- బ్రహ్మసమాజము వారెవరిపక్షమో, వారిపక్షమందె మేముందుము.

పారు:- బ్రహ్మసమాజమువారు మీపైన నాధారపడియున్నారు. మీరవలంబించిన పక్షమునే వారునవలంబించెదమని చెప్పుచున్నారు.

సాంబ:- తెల్లవాఱని. సభసమావేశముకాని ఉభయపక్షములవారి వాదములువిని నిర్ధరించుకొనెదము.

పారు:-ఇట్లయిన సందేహస్థితికలిగి, శ్రీవారికి వ్యాకులముకలుగునే?

సాంబ:- అందునకు మాయత్నమేమున్నది?

పారు:- మీగురువునందభిమానముంచి, వారిపక్షముగనే మీయభిప్రాయముల నియ్యవలెను.

సాంబ:- ఇదినిర్బంధమాయెను. మేముసమ్మతింపజాలము.

పారు:- మీరుసమ్మతింపకున్న.........(మాటనిలుపును)

సాంబ:- మాటయేల నిలిపితిరి? మేముసమ్మతింపకున్న నేమగునో చెప్పుడు.

పారు:- ఆమాటచెప్పువాడు బైటనున్నాడు.

సాంబ:- అతనిలోనికి పిలువుండు.

పారు:- (ప్రక్కకుచూచి) ఓయీ! రణజిత్తు-లోనికిరమ్ము.

ప్రవేశము-రణజిత్తు.

రణ:- (అందరికి నమస్కరించును)

పారు:- రణజిత్తు! నీచేతనున్న ఆజ్ఞాపత్రికనుచదివి వినుపింపుము.

రణ:- చిత్తము. (అని పత్రికవిప్పి చదువును.)

"అస్తగిరిరాజ కోశాధ్యక్షుండు. జమాదారు రణజిత్తుసింగుకు ఆజ్ఞాపించునదేమనిన, నీవు శ్రీగురువులవారిమఠము పారుపత్తెగారిని వెంటతోడ్కొనిపోయి, సాంబమూర్తి సిద్ధాంతినిచూచి, యువరాజు ఖజానాకు వ్రాసినచీటీలపైన మీరుసంతకములుచేసి పుచ్చుకొన్న ద్రవ్యము మొత్తము యాభైవేలు వరహాలును, యేబదిపలముల బంగారును, మీరుతక్షణము యివ్వవలసినది అనిఅడుగుము. అతడివ్వకున్న నతనియిల్లు జప్తుచేసి, చిక్కినదంతయుతీసుకొని, సాంబమూర్తిని వెంట పిలుచుకొనిరావలెను. ఈవిషయమున పారుపత్తెగారి యుత్తరువుప్రకారము నీవుజరుపవలెను."

ఫాల్గుణశుద్ధ చతుర్దశి. కుబేరదీక్షితులు,
రాజ కోశాధ్యక్షుడు.

పారు:- సిద్ధాంతిగారు! ఈయాజ్ఞప్రకారము, ద్రవ్యమును బంగారును తక్షణమే మీరియ్యవలెను.

సాంబ:- యువరాజుపరముగ పుచ్చుకొన్నదంతయు నతనివ్రయము నకె యుపయోగపడబడెను నాయొద్దనేమున్నది?

పారు:- యువరాజు మనరాష్ట్రమును విడిచిపోయినాండు. దీనికిమీరే యుత్తరవాదులగుదురు.

సాంబ:- యువరాజును నేనుతోడితెచ్చెదను.

పారు:- ఎప్పుడు?
సాంబ:- ఎల్లుండి.
పారు:- నేను వినను.
సాంబ:- రేపొకదినమవకాశమిచ్చిన చాలును. అంతయుసరిపోవును
పారు:- సిద్ధాంతిగారు! మీామనోభావము నాకు తెలుసును. ఈబాధ
ను మీారుతొలగించుకొని విముక్తులుకావలెననిన, నేనుచెప్పినట్లు
మీారుచేయవలెను.
సాంబ:- అదేమిచెప్పుము.
పారు:- ఇదిగో! యీపట్టికచూడుడు. దీనియందు శ్రీవారిపక్షమున
నభిప్రాయమును రేపటిసభలో నిచ్చెదమనివ్రాసి మీారుభ
యులును సంతకములు చేయుడు. అట్లొనర్చితిరేని, యీ
యాజ్ఞాపత్రికపైన మీారునాచేతికి ద్రవ్యమును బంగారునిచ్చి
నట్లు రశీదువ్రాసియిచ్చెదను.
సాంబ:- ఇది అన్యాయమండి.
పారు:-శ్రీవారికి యవమానము కలుగించునది అన్యాయముకాదా?
సాంబ:- కానిండు. ధర్మాధర్మములు సర్వముశ్రీకృష్ణార్పణము. ఈప
ట్టికలో మీారుచెప్పినట్లువ్రాసి సంతకములు చేసెదము. మీారుర
శీదువ్రాసీయుడు.(అనివ్రాసి యిద్దఱును సంతకములుచేయుదురు)
పారు:- రశీదువ్రాయును (రశీదునిచ్చి పట్టికతీసుకొని పోవును)
సదా:- సాంబా! ఇట్లేలచేసితివి? మనకార్యముచెడెనే?
సాంబ:- కార్యముచెడలేదు కాని యింకను యేబదివేలు నాచేతి
లోపడెను.
సదా:- అదెట్లు?
సాంబ:- రేపుసభలో అస్పృశ్యులకేవిజయమగును. అప్పుడుమదన
చంద్రునకు నేనీరశీదునుచూపి "నీవిచ్చినదంత గురువులాగుకొ
న్నాడని చెప్పి యేడ్చెదను. విజయమొందిన మదనచంద్రుడు
నాద్రవ్యమంతయు నిచ్చును.
సదా:- అస్పృశ్యులకు విజయమెట్లగును? మనయభిప్రాయము శ్రీ
వారిపక్షమనివ్రాసి చేతులనుకట్టివేసుకొన్నామే?

సాంబ:- వెఱ్ఱివాఁడా! సభలో ప్రేమచంద్రునిపక్షముగా మనముచే తులెత్తినప్పుడు మనముసంతకములుచేసిన పట్టిక లేచివచ్చి మన చేతులను పట్టుకొనునా?

సదా:- ఓరి నీయిల్లుబంగారుకాని. ఎంత యోచన రానీది?

సాంబ:- నాయిల్లుబంగారైన నీయిల్లు వెండియగును. రమ్ము లోనికి. అప్పలేశ్వని తోటలోని మామిడిపండ్లు నిన్నుపిలచుచున్నవి.

(ఇద్దఱు పోవుదురు)

——(o)——

అంకము-3 రంగము-3

అస్తగిరిలో రాజసభ.

భోగిచంద్ర-సుదామ (మంత్రి) సేవకులు.

భోగిచంద్ర:- సుదామా! మదనచంద్రునియొక్కయు. శారదాకుమారియొక్కయు, వార్తయేమైనను తెలియవచ్చినదా?

సుదా:- రాజేంద్రా! నేనుపంపిన చారులింకను మరలిరాలేదు. ఇంతలోననే క్షేమవార్త యే మనకురాగలదని నానమ్మకము.

భోగి:- కానిమ్ము. నేఁడు సనాతనపండితసభ జరుగునది ముఖ్యమైన యవసరకార్యముగనున్నది. కావున శ్రీగురువులవారినిచ్చటికి క్షణమున విచ్చేయింపజేసి పండితులసభగూర్చి నాకుచెప్పిపంపుము. (అనిపోవును)

సుదా:- ద్వారపాలకా! ఇప్పుడేపోయి శ్రీవారిని యీసభకువేంచేయింపజేసి, పండితులను సహితము తోడ్కొనిరమ్ము.

ద్వార:- చిత్తము-అందఱు సిద్ధముగనున్నారు (అనిపోవును)

ప్రవేశము-మేళతాళములతో-శ్రీవారు.

నంది-మాగధ:- శ్రీబ్రహ్మశంకర కేశవస్వాములవారికి విజయమగుగాక.

గురువు:-(వచ్చి సింహాసనముపైన కూర్చునును)

వెంటనే ప్రవేశము-విద్యామణి-వ్యాసులు-సాంబమూర్తి సదాశివ-బ్రాహ్మణులు-పౌరులు.

సుదా:- ద్వారపాలకా! రాజేంద్రుని విచ్చేయమనుము.

ప్రవేశము-భోగిచంద్రి.

భోగి:- (గురువుప్రక్కన కూర్చుండును)
సుదామా! శారదాకుమారిపక్షమున, శాస్త్రివాదమును సలుపుట కియ్యకొనినట్టి ప్రేమచంద్రయోగిని లోనికిరప్పింపుము.

విద్యామణి:- (లేచి) రాజేంద్రా! ప్రేమచంద్రుఁడు చండాలసంపర్కముచేత అస్పృశ్యుఁడు. కావున యీసభకు నతఁడు నిషిద్ధుఁడుగనున్నాఁడు.

భోగి:- (నవ్వి) విద్యామణిగారు! ఈసభయందు చర్చింపవలసిన విషయముగనుండునట్టి 'అస్పృశ్యత'ను మీరే మున్ముందుగ నిర్ధరించునట్టి యధికారమును మీరువహించుకొనిన, యీసభ యెందుకు? విమర్శయెందుకు? ధర్మాధర్మములను నిర్ధరించుటకై యేర్పడిన యీసభయందు జాతిభేదములను, తాకుడు, నూకుడులనుపాటించువాఁడనుకాను. ద్వారపాలకా! ప్రేమచంద్రయోగినితోడితెమ్ము.

ప్రవేశము-ప్రేమచంద్రి.

ప్రేమ:- ధర్మసమాజమునకు వందనము.

భోగి:- యోగీంద్రా! కూర్చుండుము. భైరవసింహరాజేంద్రునిపుత్రి శారదాకుమారి అస్పృశ్యురాలుకాదని యీసభయందువాదమొనర్చుటకు మీరుసిద్ధులైయున్నారా?

ప్రేమ:- చిత్తము. నేనుసిద్ధుఁడనై యున్నాడను. నాతోవాదించుటకు పండితులెవ్వరేర్పడియున్నారు?

భోగి:- ఆస్థానప్రథమపండితులు విద్యామణిగారును, ద్వితీయపండితులు వ్యాసులవారును, శ్రీవారిసహాయమున, మీతోవాదమొనర్పను సిద్ధులైయున్నారు.

గురువు:- (అంతటచూచి) భోగిచంద్రా! వేదగిరిసంస్థానమంత్రి విశారదుఁడు సభకువచ్చినట్లులేదే?

సుదామ:- విశారదమంత్రి సమయమునకు రాగలఁడని సత్యవతీరాణిగారు పత్రికవ్రాసినారు.

గురువు:- అట్లయిన నతడువచ్చువఱకు తాళినమేలుకదా?

విద్యా:- మనమాలస్యమెందుకు చేయవలెను?
గురువు:- విశారదుడు సనాతనవర్ణాశ్రమధర్మముల నెఱింగిన పండి తుఁడు. అతడుండిన వక్రమైన వాదములేవియు నిక్కజాలవు.
విద్యా:- అతడువచ్చినను రాకున్నను సభజరుగవలసినదేకద?
గురువు:- అట్లనే కానిమ్ము.
విద్యా:- ప్రేమచంద్రా! వాదమునకు మేముసిద్ధముగనున్నాము.
ప్రేమ:- విద్యామణిగారు! శ్రీవారుభోగిచంద్రరాజేంద్రునకు వ్రాసిపంపిన యాజ్ఞాపత్రికను చదివెదను. సభ్యులందఱు నాలకింపవలయును. (అనిచదువును)
"అస్మత్ ప్రియశిష్యుఁడగు భోగిచంద్రునకు శ్రీగురువుల ఆజ్ఞాపత్రిక, భోగిచంద్రా! నీకుమారుఁడు మదనచంద్రుఁడు అస్తగిరియందు నీవులేనిసమయమున, నీకు తెలుపక. రాజగురువులగు మాకును తెలుపక, అరవిందపురమురాజగు భైరవసింహునిపుత్రి శారద నుద్వాహించియున్నాఁడు. భైరవసింహునితల్లి మనోరమ, బ్రాహ్మణస్త్రీగనుండినందునను, అతనితండ్రి ఉగ్రసింహుఁడు శూద్రుఁడుగనుండినందునను, భైరవసింహుఁడు చండాలుఁడగును. అతనిపుత్రి శారద చండాలబాలయగును. చండాలులు అస్పృశ్యులని శాస్త్రములు నిర్ణయించుచున్నవి. కావున యీవివాహసంబంధముచేత మదనచంద్రుఁడస్పృశ్యుఁడై రాజ్యపాలనకు అయోగ్యుఁడుగనున్నాఁడు. ఈవిషయము మదనచంద్రునకు మేము తెలిపి, శారదను రాణివాసబహిష్కృతను చేసినాము. ఈపత్రిక నీవుచూచినతక్షణమే యస్తగిరికేతెంచి, శారదా మదనచంద్రులను రాజ్యబహిష్కృతులనుచేసి, ముందుధర్మమార్గమున సంస్థానపరిపాలన జరుగునట్లు నియామకములొనర్చి, నీవుమరల యాత్రకు పోవలెనని యాజ్ఞాపించుచున్నాము.
ప్రేమ:-(పత్రికముగించి) విద్యామణిగారు! నేనింక ప్రశ్నింపవచ్చునా?
విద్యా:- అడుగుము.
ప్రేమ:- అస్పృశ్యుడని మీరుపిలుచునట్టివాడు మనభారతీయుఁడేనా? లేక పరదేశమువాఁడా?

విద్యా:- అస్పృశ్యుడు భారతీయుడే.

ప్రేమ:- భారతీయులలో నుండునట్టి నాలుగువర్ణములలోన, నేవర్ణమునకు అస్పృశ్యుడు చేరినవాడు?

విద్యా:- వీడు పంచమవర్ణమునకు చేరినవాడు.

ప్రేమ:- పంచమవర్ణమున్నదా?

విద్యా:- ఎందుకులేదు ఉన్నది.

ప్రేమ:- పరబ్రహ్మయొక్క సృష్టిప్రకారము తెలుపునట్టి వేదోపనిషత్తులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు నాలుగేనిర్ణయింపబడినవే, పంచమవర్ణముయొక్క నిర్ణయమునకు వేదవాక్యమేదైననుండిన చెప్పుడు.

విద్యా:- దీనికి వేదవాక్యమెందుకుండవలెను?

ప్రేమ:- వేదవాక్యములేకున్నను "చాతుర్వర్ణంమయాసృష్టం గుణకర్మవిభాగశః" అనినట్లు పంచమవర్ణవిషయమున భగవద్గీతావాక్యమైనను కలదా?

విద్యా:- వ్యాసులవారు! మీకు భగవద్గీతలు నిత్యపారాయణము కద? మీరే ప్రత్యుత్తరమివ్వుడు.

వ్యాస:-భగవద్గీతలలో పంచమవర్ణముయొక్క సూచనకూడలేదు

ప్రేము:- అట్లయిన, విద్యామణిగారు! పంచమవర్ణమేదియో నిర్ణయింపుడు.

గురువు:- విద్యామణీ! నీవూరకుండుము. ప్రేమచంద్రా! చండాలుడనిపిలువబడునట్టి మానవుడున్నాడా లేడా? నీవుచెప్పుము.

ప్రేమ:- ఉన్నాడు

గురు:- చండాలుడేవర్ణమునకు చేరినవాడో నీవేనిరూపింపుము చూచెదను.

ప్రేమ:- జన్మచండాలుని నిరూపింపవలెనా? లేక కర్మచండాలుని నిరూపింపవలెనా? సెలవిండు.

గురు:- కర్మచండాలుడని యెవ్వడున్నాడు? వ్యాసా! ఇట్టియసంగతప్రశ్నలు చేయుచుండగ నీవేలయూరకున్నాడవు?

వ్యాస:- గురువర్యా! కర్మచండాలులు పూర్వమందుండిరి. ఇప్పుడు నున్నారు. కావున యీ ప్రశ్న సమంజసముగనేయున్నది.

గురు:- వ్యాసా! నీమదికి విభ్రమము కలిగినట్లున్నది.

వ్యాస:- గురువర్యా! నాకుః శుభ్రముగనేయున్నది. ఒక్కటే దృష్టాంతము విన్నవించెదను ఆలకింపుడు. వాల్మీకిమునుపు కర్మచండాలుఁడై యుండి, నారదోపదేశంబున, చండాలత్వమునశించి బ్రహ్మర్షియాయెను. విద్యామణిగారు! కర్మచండాలులులేరని మీరుచెప్పగలరా?

విద్యా:- గురుచంద్రా! కర్మచండాలుని చర్చయే ప్రకృతముమనకు అనవసరము. భైరవసింహుడు జన్మచండాలుడనికదా మనము చెప్పునది. కావున ప్రేమచంద్రా! మావాదమువినుము. ఆది పండితుఁడును. సకలశాస్త్రాభిజ్ఞుఁడును, మహాప్రాజ్ఞుఁడును, జ్ఞానియు, సంస్కృతవిద్యాగురువునగునట్టి అమరసింహుఁడు "స్యాచ్చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాంవృషలేనయః" అనినాడు. ఈ వాక్యము నీవొప్పెదవా లేదా?

ప్రేమ:- ఒప్పెదను.

విద్యా:- అట్లయిన భైరవసింహుడు జన్మచండాలుడాయెనుకద?

ప్రేమ:- అవును.

విద్యా:- ఇంక నీవాదమేమున్నది?

ప్రేమ.- జన్మచండాలుడు పంచమవర్ణమువాడు కాఁడనియే నా వాదము.

విద్యా:- దీనికి నీయాధారమేది?

ప్రేమ:- మీ అమరసింహుని వాక్యమే ఆధారము. 'శూద్రాశ్చఅవరవర్ణాః' అనినాడు. ఇందువల్ల శూద్రవర్ణమే అధమమై కడపటిదైయుండగ యింక పంచమవర్ణమెక్కడిది? లేనేలేదు.

విద్యా:- కానిమ్ము. పంచమవర్ణము లేదనుకొందము. జన్మచండాలుఁడేవర్ణమువాడో నిర్ణయింపవయ్యా చూతము.

ప్రేమ:- దీనిని మీ అమరసింహుడే నిర్ణయించియున్నాడు. 'ఆచండాలాత్తుసంకీర్ణా అంబష్ఠకరణాదయః' అనినాడు చండాలుని

తో పాటుపడుగురు. అంబష్ఠుఁడు మొదలగువారు శూద్రవర్గ యందే చేరియున్నారు. విజాతీయ మాతాపితృలకు జనించిన వారికి, రెండుజాతులును తగులుటచేత సంకీర్ణులనబడి శూద్రులలో చేరియున్నారు. కావున చండాలుని పంచమవర్ణమువాఁడనుటది శుద్ధతప్పు. మీయమరసింహుఁడు పంచముడనువాడున్నట్లుకాని, చండాలునకు పంచముడని పేరున్నట్లుకాని చెప్పియున్నాఁడా?

విద్యా:- వ్యాసులవారు! ఈవిషయమును మీరుచక్కగ యోచించి వాదింపుఁడు.

వ్యాస.-మీ వాదమును మీయమరసింహుఁడే ఖండించియున్నాడు. జన్మచండాలుడు శూద్రవర్గవాడని నిర్వివాదముగ వెల్లడియైయుండగా యింకనావాదమేమున్నది? మీవాదమేమున్నది?

విద్యా:- అదిపోనిండు. చండాలుఁడు అస్పృశ్యుడనువాదము నిలిచియున్నదికద?

ప్రేమ:- శూద్రుడు అస్పృశ్యుడు కాకపోయినప్పుడు శూద్రవర్గకుచేరిన చండాలుడెట్లు అస్పృశ్యుడగును?

విద్యా:-చండాలునియొక్క తల్లియు, తండ్రియును తమవర్ణాశ్రమ ధర్మములనుత్యజించి, దురాచారదుష్కర్మల నవలంబించి, అసహ్యమగు నడతవలన, సనాతనులకస్పృశ్యులైయుండునట్టి స్థితిలో వారికి వీఁడుజనించినందున, జన్మముతోడనే చండాలుడు అస్పృశ్యుడాయెను.

ప్రేమ:- అట్లయిన దురాచారదుష్కర్మతోకూడిన, అసహ్యప్రవర్తనవల్లనే, అస్పృశ్యతసంభవించుననికదా మీరొప్పుకొనుచున్నారు?

విద్యా:- ఊరక చెప్పినదానిని యొప్పుకొనినట్లగునా? నీమొండివాదము నాకువలదు. వ్యాసులవారు! అస్పృశ్యతయొక్కయుత్పత్తి విషయము మీరే చెప్పుడు.

వ్యాస:- శ్రీవారి సెలవైనచెప్పెదను.

గురు:- అదియే మా చెప్పము.

వ్యాస:- ధర్మసభ దైవసభ యగుటచేత, నాకు తెలిసినదానిని దాచక చెప్పెదను. ఆదియందుండిన నాలుగువర్ణములవారు చాలకాలము వఱకు కలియందు అస్పృశ్యతాదోషమను మాటయే లేకుండ, ప్రవర్తించిరి. ఇట్లుండగ, వీరిలో కొందఱు అజ్ఞానులైదురాచారము లొనర్చుచు, సమాజమున కసహ్యమైన కర్మలను చేసిరి. ఈదురాచారులను సంస్కరించుటకై సదాచారపండితు లెంతయత్నించినను, వారియందు అవిద్యయే వృద్ధిచెందుచు, చక్కనితోవకు వారురాకపోయిరి. ఈదురాచారులయొక్క సహవాసముచేత సదాచారులు సహితము చెడుదురని దూరదర్శులగు పండితులు భయపడి యోచించి, దురాచారులయొక్క స్పర్శనమే నిషేధించి, వారిని దూరముగనుంచి, వారికి పంచమజాతియనునది తామొకల్పించి, వారిని పంచములని పిలుచుచు, తాము సనాతనులని పిలుచుకొనిరి. వారికి పంచములని నామకరణము చేసినది చాలక వారిని అస్పృశ్యులనియు, చండాలులనియు సనాతనులు అప్పటికిని ఇప్పటికిని పిలుచుచున్నారు. ఈపంచములయొక్క జీవనోపాయమునకు, సనాతనులే ఆధారభూతులుగ యేర్పడి, వారిని కేవలము దరిద్రులుగ చేసి, తాముచేయుటకు అసహ్యములనునట్టి నీచకర్మములను పంచములతో చేయించుచు, వచ్చినందున, పంచములు విద్యావిహీనులై, హీనదశచెంది క్రిందికిపడిరి. ఇట్లుపతితులైనవారిని, స్వార్థులగు సనాతనులు ఇంకింత అణగద్రొక్కి యిదివరకు వారియొక్క వృద్ధికే నిరుద్ధులై యున్నారు. పంచములకు సత్కర్మలయందు మనస్సుపుట్టినను, యీసనాతనులు, వారిని యుద్ధరించునట్టి ధర్మమునే మఱచియున్నారు. ఇదియే నిజస్థితి.

విద్యా:- వ్యాసులవారు! అస్పృశ్యుడేరీతి నుద్ధరింపబడును?

వ్యాస:- యోగీంద్రా! మీరే ప్రత్యుత్తరమివ్వుడు.

ప్రేమ:- జ్ఞానియగువాని యుపదేశసంపర్కములచేత అస్పృశ్యుడు పరిశుద్ధుడు కాగలడు.

విద్యా:- జ్ఞానియగువాడు అస్పృశ్యుని తాకునా?

ప్రేమ:- తాకిన నేమగును?

విద్యా:- ఏమగునా? నల్లని బొగ్గు దేహమునకు తగిలిన, దేహము నల్లగై చెడిపోవును.

ప్రేమ:- అస్పృశ్యుడు నల్లనిబొగ్గుఅంటిరే జ్ఞానియెట్టివాడు?

విద్యా:- దేహమందుజ్ఞానాగ్ని తేజము ప్రజ్వరిల్లుచుండుటచేత, జ్ఞాని, యెఱ్ఱనిఅగ్నివంటివాడగును.

వ్యాస:- విద్యామణిగారు! అమరసింహునితో గొంతుకోయించుకొన్నది చాలక, మీరే మీగొంతును కోసుకొనుచున్నారే? ఇదేమి.

ద్యా:- అదియెట్లు?

వ్యాస:- చెప్పవలయునా? వినుడు. అస్పృశ్యుడు అనునట్టి నల్లని బొగ్గును, జ్ఞాని అనునట్టియెఱ్ఱనిఅగ్ని తాకెనేని, ఆబొగ్గుసహితము అగ్నియై రెండును కలిసిసమత్వమునే చెందును కాని అగ్ని నల్లగై చెడిపోవునా?

బాల్హి:- (లేచి) అగ్నినల్లగకాదు—చెడిపోదు సెలవైన నిప్పుడే అగ్ని బొగ్గు రెండును తెచ్చి పరీక్షచూపెదను.

సాంబ:- జ్ఞానియొక్క ఉపదేశమువలన, అస్పృశ్యుడుజ్ఞానికాగలడు

విద్యా:- జ్ఞానియగువాడు, అస్పృశ్యునిదగ్గఱకు రానిచ్చునా?

ప్రేమ:- మీరు దినదినమును అస్పృశ్యునిదగ్గఱకుపిలుచుచునే యున్నారు.

విద్యా:- ఎవ్వడా అస్పృశ్యుడు?

ప్రేమ:- మంగలివాడు. మీఅమరసింహుడే చెప్పినాడు. క్షురీ ముండీ నాపితఅని మంగలి నాపితుడుఅనగా అస్పృశ్యుడుకాడా? మీరును మీగురువులును మంగలినిదగ్గఱకు పిలుచుటయే కాక మీసర్వాంగములను వానిచేతి కి అప్పగించుచుండలేదా?

విద్యా:- (ఊరకుండును)

గురువు:- ఏమివిద్యామణీ ఊరకున్నాడవు?

విద్యా:- గురుదేవా! పంచమవర్ణముశాస్త్ర నిర్ణీతముకాకపోయెను, జన్మచండాలుడు శూద్రవర్ణములో చేర్చబడినందున, అస్పృశ్య

డు కాకపోయెను అస్పృశ్యత నశించునదే కాని శాశ్వతముగ నుండునదికాకపోయెను ఇంకేవిషయము నెత్తి నేనువచింపవలయునో సెలవిండు.

గురువు:- ఉండునది ఒక్కటేవిషయము. "శారద అస్పృశ్యురాలు" అనునది. దీనినినీవు అవునందువా, కాదందువా నీయభిప్రాయము చెప్పుము. ఇంకయే వాదమునువలదు.

విద్యా:- గురువర్యా! మనబ్రాహ్మణ సమాజము వారిని మొదట ప్రశ్నింపుడు. వారియభిప్రాయము నేనా చూదించెదను. వారు సమాజసాభిప్రాయము నిచ్చెదరనియే నాకునమ్మకముకలదు.

గురువు:- అట్లయినసరి. బ్రాహ్మణపండితులారా! మీరందఱును, యేకాభిప్రాయమునొందియున్న మీలోనెవ్వరైనను దానిని ప్రకటింపుడు.

సదా:- గురుదేవా! మాయందఱిది యేకాభిప్రాయమయ్యేయున్నది. దానిని సాంబమూర్తిగారు వెల్లడిచేయుదురు.

గురువు:- మంచిది సిద్ధాంతీ! లేచిచెప్పుము.

సాంబ:- (లేచినిలచి) గురువర్యా! రాజేంద్రా! బ్రాహ్మణసమాజముయొక్క యభిప్రాయములను విన్నవించెదను. ఆలకించుడు

మొదటిది—పంచమవర్ణము శాస్త్రనిర్ణితముకాదు. ఇదితత్కాల కల్పితమైనది.

రెండవది— జన్మచండాలుడు శూద్రవర్ణములో చేరి, అస్పృశ్యుడు కాడు.

మూడవది— శారదాదేవిగారు, అస్పృశ్యరాలు కాదు.

నాల్గవది— అస్పృశ్యత జ్ఞానోదయముచేత నశించును.

(అనికూర్చును)

భోగిచంద్ర:- బ్రాహ్మణోత్తములారా! శ్రీగురువులవారు చేసిన అస్పృశ్య నిర్ణయమునకు నాధారంబుగ వారికిమెట్టిశాస్త్రాధికారముకలదో మీరు తెలుసుకొనినారా!

సాంబ:- మాకుబాగుగ తెలుసును. శ్రీవారిది "స్వార్థకశాస్త్రము,

సదా:- మరియు "ఆశా శాస్త్రము"

బ్రాహ్మ:- ఇంక మరి "అనుకూల శాస్త్రము"
భోగి:- విప్రోత్తములారా! ఇట్టిపలుకులాడి, గురుద్రోహులు కాకుడు.
సాంబ:- మేముగురుద్రోహుల మగుదుమోకామొ, తెలియదు కాని, యీగురువులమాటవిని, హిందూమత ద్రోహులము కాజాలము,
సదా:- మరియు రాజద్రోహులముకూడ కాజాలము
బ్రాహ్మ:- ఇంకా మరి దైవద్రోహులముకాజాలము.
గురువు:- (ఆగ్రహముగ) భోగిచంద్రా! నాయధికారవిషయము ప్రశ్నింపబడినందున, నేనుచెప్పెదను వినుము. నేను బ్రాహ్మణ సమాజమునకే గురువగుటచేత, వీరియభిప్రాయములను ఖండించుటకు నాకు సంపూర్ణాధికారముకలదు. కావున, శారద అస్పృశ్యురాలని నేను నిర్ణయించినది అట్లనేనిలచియున్నది. నాయభిప్రాయమే చెల్లతగియున్నది.
ప్రేమ:- గురువర్యా! బ్రాహ్మణసమాజమునకు అధికారులుగ మీరు మీయభిప్రాయము నిచ్చితిరి. బ్రాహ్మణులతోపాటు సకల ప్రజలకును అస్తగిరి భూదేవికిని, అధికారిగనుండునట్టి భోగిచంద్రరాజేంద్రుడు తనయభిప్రాయము నివ్వవచ్చునా లేదా? సెలవిండు
గురువు:- ఏమి? భోగిచంద్రుడు నన్నుకాదని వేరెయభిప్రాయము నిచ్చునా?
ప్రేమ:- గురువర్యా! రాజేంద్రుని మనస్సుననుండు మాటను నేను చెప్పుటకెట్లు సాధ్యమగును?
బ్రాహ్మణులందరు:- రాజేంద్రుని యభిప్రాయమును మేము విననే వలయును.
గురువు:- భోగచంద్రునియభిప్రాయమును నేనును వినుటకు సిద్ధము గనున్నాడను.
ప్రేమ:- గురువర్యా! రాజేంద్రుడు తనయభిప్రాయమును తెలిపె నేని, యందులఫలమేమియో సెలవిండు.

గురువు:- భోగిచంద్రుడు నన్నుకాదని భిన్నాభిప్రాయము నిచ్చిన యెడల, మేమిద్దఱము నొప్పునట్టి మధ్యస్థునియొక్క తీర్మానమునకు మనమందఱమును బద్ధులుకావలయును.

ప్రేమ:- అట్లనేకానిండు. రాజేంద్రా! మీయభిప్రాయమును సెలవిండు.

భోగి:- సభాసదులారా! పండితులయొక్కయు యోగీంద్రుని యొక్కయు, వాదములను నేనుచక్కగ గమనించినాడను. బ్రాహ్మణ సమాజమువారు యేకవాక్యముగ వచించిన యభిప్రాయములు ధర్మసమ్మతములై యున్నవని నాటినే నేనామోదించుచున్నాడను. శారదాకుమారి పవిత్రరాజపుత్రికయగునేకాని యస్పృశ్యురాలుకాదు. శ్రీగురుదేవులు పొరవడియుండవచ్చును కావున పునస్సర్యాలోచన యొనరించి, నాతో నేకీభవింతురని నమ్ముచున్నాడను.

గురువు:- అదియెంతమాత్రమును కాజాలదు. ఈవిషయమును మధ్యస్థుండే పరిష్కరింపవలయును.

ప్రేమ:- గురువర్యా! మీరు నియమింపఁగోరునట్టి మధ్యస్థుడెవ్వడగునో సెలవిండు.

గురు:- వేదగిరి మంత్రి విశారదుని నియమించుటకు నేనుకోరెదను.

ప్రేమ:- రాజేంద్రా! మీరేమందురు?

భోగి:- విశారదమంత్రి మధ్యస్థుడుగ నుండుటకు నేనును సమ్మతించెదను.

ప్రేమ:- రాజేంద్రా! విశారదున కంతటియోగ్యతకలదా?

గురువు:- ఇదియేమిప్రశ్న ప్రేమచంద్రా! మేమిద్దఱమునొప్పిన మధ్యస్థునివలదనుటకు నీకధికారములేదు. విశారదుడు మిగుల యోగ్యుడు. ఈవిషయము నతడే పరిష్కరింపవలయును.

ప్రేమ:- విశారదుడు పరిష్కరించియే యున్నాడుకద?

గురు:- ఏమని పరిష్కరించినాడు?

ప్రేమ:- శారదాదేవి అస్పృశ్యురాలు కాదని.

గురు:- ఎప్పుడు పరిష్కరించెను?

ప్రేమ:- ఇప్పుడె

గురు:- ఇంతవఱకు నీవు వెఱ్ఱివాదముచేసినందున నీకు పిచ్చితల కెక్కియున్నది. విశారదుడీసభకు రానేలేదే అదెట్లుపరిష్కరింప గలడు?

ప్రేమ:- విశారదుడువచ్చియున్నాడు.

గురు:- ఏడీ!

ప్రేమ:- (తటాలునవేషమువిప్పి) నేనేవిశారదుడను.

గురు:- (నిర్విణ్ణుడై తలవంచుకొనును)

ప్రవేశము-మదనచంద్ర-శారద-వసంత-భారతీ-
సత్యవతీ-మునిస్వామి.

మదన:- (మొదటప్రేమచంద్రునకు-తర్వాత బ్రాహ్మణులకు-పిమ్మట భోగిచంద్రునకు, నమస్కరించును.)

ప్రేమ:- మదనచంద్రా! గురువులవారిని మఱచితివే.

మద:- ఆయస్పృశ్యుడు నావందనమున కర్హుడుకాడు.

గురు:- (లేచిపోవయత్నింపగ)

మద:- సన్యాసీ! పోకుము. నిలువుము. భటులారా! ఈసన్యాసిపరు గెత్తకుండ కాచియుండుడు.

భటులు:- (గురువుచుట్టు నిలచెదరు)

భోగి:- విశారదా! నీవుమహాత్ముడవు. అవతారపురుషుడవు. నీప్రభావము కడునద్భుతము. నారాష్ట్రమందు సనాతనులయొక్క క్రౌర్యముచేత, చిరకాలమునుండి బాధితులై యుండునట్టి మానవసంఘము నుద్ధరించితివి. నారాజ్యము నేరక్షించితివి. ఇకమీద నాకురాజ్యభారమువలదు. నీశిష్యుడు మదనచంద్రుడే అస్తగిరినియేలని. రెండుసంస్థానములకు నీవేరక్షకుడవై యుండవలెను. (అని మదనచంద్రుని శారదను సింహాసనముపైన కూర్చుండబెట్టును.)

మదన:- సభాసదులారా! ఈసన్యాసి రాజ్యాధికారమును తనచేతియందుంచుకొని నాజనకునిబొమ్మవలె ఆడించునట్టి దుర్గుణ-దురాశలనుపొంది దుష్కార్యములనొనరించి కర్మచండాలుడై

యుండుటచేత నితడు మనరాష్ట్రమునకే అస్పృశ్యుడైయున్నా
డు. కావున యితని నిప్పుడె నారాష్ట్రమునుండి బహిష్కృతుని
చేసితిని. సన్యాసీ! నీవు నారాజ్యమందెచ్చటను నుండరాదు.
వెడలిపొమ్ము.

గురువు:- (పోవును)

మదన:- వసంతసోమయాజులుగారు మీరు గురుమఠమును స్వాధీ
నము చేసుకొనుడు. (మునిస్వామితో) మునిస్వామీ! నీకు 'ముని
చంద్రిక'ను బిరుదునొసగి నారాజ్యమందు ముఖ్యసేనాధ్యక్షుని
యుద్యోగము నొసంగితిని. (హరిజనులతో) హరిజనసోదరులా
రా! నిజమగు రాజభక్తియు, దైవభక్తియుకలవారు హరిజను
లేయని భరతఖండమునందు ప్రకటితమాయెను. ఆసన్యాసిమా
టలనుపాటించి, యిన్ని దినములు మిమ్ములను మేము బాధించినం
దునకు మీరుక్షమింపవలెనని, వేడుచున్నాడను.

సాంబ:- (లేచి) రాజేంద్రా! హరిజనులను బాధించినట్టి పాపభార
మంతయు మాయందేయున్నది. మాపాపమునకు ప్రాయశ్చిత్త
ము యిదిగో చేయుచున్నాను (అనిసాష్టాంగదండమునిడును)

మదన:- ఈపురమునకిప్పటినుండు "అస్తగిరి"యనుపేరును తీసివేసి,
"హరిజనపుర"మను పేరును పెట్టితిని. నారాజ్యమందు పంచము
డని-చండాలుడని-అస్పృశ్యుడని యేమానవుడును పిలువబడరా
దని ఆజ్ఞాపించుచున్నాను. ఇకమనమందరమునుచేరి శ్రీహరిభజ
న సల్పుదము.

అందరు:- (లేచి హరిభజనచేయుదురు.)

పాట-అనుబంధము 20

మంగళము.

---

# ప్రేమచంద్రయోగి లేక అస్పృశ్యవిజయము

## అనుబంధములు

సూత్రధారుడు. **1** మోహన రూపకము.

శ్రీమనోహర! రామశ్రీకర! శ్యామసుందరా! అఘపరిహార॥
సామజారివిదార,శ్రీధర! రామగుణధామా! శుభనామా! వర,
ప్రేమాలయ!।శ్రీ॥

1. వనజాసననుత, పావన! వనజాలయభాగ్యసదన!
అనిశము మది, నినుగొలచెద-కనికరమున-ననుగావుము। శ్రీ॥

సాంబ **2** బలహరి (మాండ్) ఆది.

ద్రవ్యమే రెండక్షరముల-దివ్యమైనమంత్రము
ద్రవ్యపూజనరుఁడు సేయు-దనరుభవ్య [illegible]క్షము॥ ద్రవ్య॥

1. ధనముకల్గువాఁడెఘనుఁడు-ధనముకల్గువాఁడెబలుఁడు
ధనికుఁడెంతపాపియైన-ధర్మవంతుడనబడు॥ ద్రవ్య॥
2. ఎంతవిద్యయున్న నేమి? యెంతసత్యమున్న నేమి?
చేంతకాసు లేనివాఁడు-చెనటిజీవుఁడేయగు॥ ద్రవ్య॥

మాలలు. **3** హిందూ-మిశ్ర-ఆది,

(జయ)రవికులభూషణ,శ్రీరామా! భవభయభంజన రఘురామా!

1. జానకిరమణా! శ్రీరామా-జయదానవదమనా-రఘురామా॥జయ
2. వాసుకిశయనా,శ్రీరామా! జయ-వారిజనయనా,రఘురామ॥
జయరవి॥

సాంబ. **4** యమన్-ఆది.

భామాజననుత శ్రీకామా!-భాసురరతియుత, శ్రీకామా
కామితవరదా, శ్రీకామా కాంచనఫలదా శ్రీకామా॥భామా॥

1. కాముఁడెదేవుఁడు-కాముఁడెపూజ్యుఁడు
కామునిభజనమె-కామితము

శారద. **5** ధన్యాసి-ఆది.

నీపదధ్యానము సేతునుకృష్ణా నెనరునకావుమునన్॥కృష్ణా నెనరున॥

1. తాపసలోలనా-తాపమురయమున బాపవె, కరుణాసాగరకృష్ణా॥
నెనరున॥

2. వేదవినోదనా-వేదననాఱ్చుము-వేఁడెదకమలానాయకకృష్ణా॥
నెనరున॥

భారతి. 6 యమన్-ఆది.

(హరి) శౌరీ! వారిధిశయనా! పరిపాలింపుము-పంకజనయనా॥ శౌరీ॥

1. ననుకాపాడుము-ఘనగుణశీలా! వనమాలాంచిత-వాసవపాలా॥
శౌరీ॥

2, ఖగవాహనకడు-కరుణముచూపుము
నిగమాత్మా! నా-వగనెడబాపుము॥ శౌరీ॥

మదనచంద్రి. 7 నాటకురంజి-రూపక.

మీననేత్ర యో-లేక-మించుతీగయో-కాన
మెఱయుచునఁగెను-త్వరితమె॥ మీన॥

1. ఎందుజూడనైతినిట్టి యందమైనచికిలిమోము
చందురుండెభూమికిదిగి-విందొనర్చి వెడలెనేమొ॥ మీన॥

2. కాంచి కాంచకున్నముందె-మించుమించివేగమరిగె
సంచలింపజేసిమదికి-పంచశరుఁడుబాధయొసఁగె। మీన॥

శారద. 8 మాండ్-ఆది.

నీకులకాంతను నేగదరమణా! ఇంకేలనుమసలక॥ రమణా॥ పల్లవి
నేమనజాలను-నిర్దయవిడుమా నీతినిమదినిడుమా॥ రమణా॥

జేత్. అనుపల్లవి.

నీమీదఁ-బ్రాణము, నుంచినదాననే
కామించివెంటనే, వచ్చినదాననే
వేమారునునిన్ను, వేఁడెడుదానను ఆమోదంబున-ప్రేమజూపుము॥
నీకుల॥

భారతి-మదనచంద్రి. 9 హిందూ-మిశ్రి-ఆది.

భారతి:- తొలఁగుము-దూరము కలుషవిచారా
కులసతినేనని తెలియవదేరా?
బలమగుపాపం బనిగనవేరా॥

మదన:- బాలరో, నా పైననింత చలమొందిననే తాళగనౌన?
ఏలుమునఁ దయతోఁ చాన॥

భాతిర:- జడమతినీవిటు చెడుగుతలంపున
కడుకొనినిల్చిన కడిదినిగాంతుర
దుడుకిదిచాలుగా తడయకపోరా॥
మదన:- వేఁడెదనే వెలఁదీ నిన్ను। జడజాక్షి రానే-నోడితినీకు
పోడిమిగా కనవే కాంత॥

మదనచంద్రి. **10** నాటకురంజి-రూపకము.

ఏలనే, యింత వైరము? చెలీ! యేలనే
లలనామణి, కరుణింపుము॥ యేలనే॥
1, సన్నుదంబును, కనివడిరమ్ము। కమ్మనికౌఁగిలి నాకికనిమ్ము
కొమ్మా నీ కిది మేలా?। రమ్మాముద్దులబాలా॥ యేలనే॥
2 నామనోజ్ఞ, భామినిరా। సా, మజేంద్ర, గామినిరా
ఆమోదం బిం పార। వామాక్షీ! నినుగోర॥ యేలనే॥

ముత్తు-గంగు. **11** జంజూజి-ఆది.

గోకులబాలా గోపాలా। జయ గోవర్ధనధర గోపాలా॥జయ॥
1. నందకుమారా గోపాలా జయ, నవనీతచోరా గోపాలా॥ జయ॥
2. మురళిమనోహర గోపాలా జయ, పరమవిచారా! గోపాలా
॥జయ॥
3. కామవిదారా, గోపాలా!జయ ప్రేమవిహారా! గోపాలా॥జయ॥

సాంబ. **12** నవరోజు-ఆది.

1. కాసులోనకానిపించు కాశికైలాసము
వాసుదేవుడుండునట్టి వైకుంఠము
మోసమెంతియున్నగాని దోసమెంతయున్నగాని
కాసులున్నచాలు, నంత మాసిపోవును ॥కాసులోన॥
2. చచ్చువానిలేవనిచ్చు నొచ్చువానినవ్వనిచ్చు
మెచ్చుమందుకాసుమెంత మేలైనది
అచ్చంపుజ్ఞానినైన అష్టైశ్వర్యుడనిపించు
ఇచ్ఛగించుకోర్కెలెల్ల నీడేర్చును॥ కాసులోన॥

బ్రాహ్మణులు. **13** హిందూ-యమన మిశ్ర-ఆది.

అందరు: కుక్షి నిండనబ్బెమాకు భక్షణంబులన్ని యిందు
కూలబడినలేవలేము కూతనోటవెళ్ళదు॥

1. బ్రా॥ మూడుపదులలడ్డులొక్క ముద్దచేసియుంచితి
కూడులేకచిక్కియున్న కుక్షిలోకిదించితి॥కుక్షి॥

2. బ్రా॥ చారుపప్పుపెరుగుపాలు సారమొందకలిపితి
ఊరుగాయచప్పరించి ఊబులూటలూస్చితి॥కుక్షి॥

బ్రాహ్మణులు. **14** కన్నడ-ఆది.

2. బ్రా: తడపెట్టుయుబ్బరమెట్లు తగ్గునయ్యా?
3. బ్రా: కడుపులోనున్నదంత కక్కవయ్యా॥తడ॥
2. బ్రా: పుస్టెపుస్టెయబ్బబ్బబ్బ పొట్టపోటు
4. బ్రా: పొట్టలోనిలడ్డులన్ని బైటపెట్టు॥తడ॥

చేత్. 1. మందరోగముపుస్టెమనకు నెందుకన్నతింటిమో?
మంచిలిచ్చువారులేక యిందెచావు కందుమో?
ఏమో? ఎట్లనో? దైవమా॥తడ॥

2. ఇండ్లుభార్యలచూచునాశ యింతటితోతీరెనే?
పెండ్లిశ్రాద్ధభోజనాల తిండితప్పిపోయెనే?
ఏమో? యెట్లనో? దైవమా? ॥తడ॥

బ్రాహ్మణులు. **15** పల్లకిమోయుపాట.

ఓం ఓం ఓం—ఓం ఓం ఓం

1. అన్నమంత, అరిగెపోయె ఓంఓంఓం.
2. నెయ్యియంతకరిగిపోయె ,,
3. జందెమంతచినిగిపోయె ,,
4. జాతియంతమునిగిపోయె ,,
5. ధర్మమంతతఱిగిపోయె ,,
6. కర్మమంత సాగిపోయె ,,

7. బట్టలన్ని తుంటలాయె ,,
8. పొట్టలన్ని మట్టమాయె|| ,,

శ్రీమచంద్రి, 16 హిందూ-మిశ్రి-ఆది

పొలుపార గాన్ని పూజించెదము పురుషోత్తమ కృష్ణా|| పొలుపార||

1. సుందరముఖజితసోమా! వరగుణమందిర! శ్రీకృష్ణా!
వందితసురుచిరపాదాంబుజ యదునందన! శ్రీకృష్ణా!
ముదమార వగపార నినుజేరువిధంబుజూపుము భక్తులగావుము
మధుసూదన! కృష్ణా ||పొలుపార||

సత్య-శారద-భారతి. 17 యమక-రూపక.

నందబాల, పాపహరా! బృందలోలసౌఖ్యకర!
ఇందిరేశ. చక్రధరా! కృష్ణమంగళం||

1. దానవమదహరణఘనా! మానితగుణజ్ఞానసదనా!
దీనపాలశేషశయన! ధీరమంగళం||

2. వాసవాదిదేవవినుత! భాసురాంగభవ్యచరిత!
వాసుదేవ, సత్యకలిత! శ్రీశమంగళం||

మదన-సత్యవతి, 18 బిల్హారి-ఏక.

మద: మేలుకాము, మగువయిడిసి మిగుల, రగిలి, బిగియకే
సత్య: పోలదిట్టి చలము రిత్తకలవర, మిదికలుషుడా
మద: తెలివి గలిగి తెరలవే
సత్య: వలువ యవల తొలగరా
మద: తీఱుగాని తెఱగుమాని తెఱలు తెఱవ తెగడకవే
సత్య: శూరుడైన చెఱనుబట్ట చేరరారచూచెదవే
మద: చలము, పదలి తొలగు చెలువ సలుప, వలదు, జాగికవే
సత్య: పలువ, చనుము మసలిననిను శమనుపురికిపనిచెదవే
మద: కోమలాంగి క్రోధభంగి కూయవలదు వెడలిరా
సత్య: తామసుండ తార్పులాడ తాపమొంది చెడమురా||

సాంబ. 19 సావేరి-రూపక.

ప్రేమయే రెండక్షరముల రామనామమంత్రము
ప్రేమ యోగి సేయు భువికి క్షేమమైన కార్యము||

1. ప్రేమగల్గువాఁడె ఘనుఁడు ప్రేమగల్గువాఁడె బలుఁడు
ప్రేమసంధుఁడైన నరుఁడు రామచంద్రసామ్యుఁడు||

2. ప్రేమయే దైవమగును ప్రేమయే మోక్షమగును
ప్రేమశూన్యుఁడవనిపైన క్షామదేవసముఁడగుఁ||

అందఱు. 20 జేంగ్-ఆది.

మందరధర! సుర వందిత శుభకర! నందయశోదా, సుకుమారా
మానాథా! ఆ, నందప్రచారా! దీనాధారా! దురితహారా||మందర||

1. గురుతరాఘమోచనా! హరిశశాంకలోచనా!
ఘోర, దైత్య గర్వ, హరణ నీరజాక్ష, పావనా!
పరమణి, కౌస్తుభ, భూషణ బుధజనపాలన భావన శ్రీసదనా
కరుణాభరణా! విమలాచరణా కమలారమణా కరిభరణా|
మంగళం కృష్ణ జయ మంగళం, రుక్మిణీశ, మంగళం
||మందర||

మంగళము.